# అక్షరమణమాల

సాక్షాదరుణ గిరీశ్వర వరార్హమగు
అక్షరమణమాల నమరించుటకును
కరుణాకరుండగు గణపతి యొసగి
కరమభయ కరము కాపాడుగాక!

అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా
అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా

1. అరుణా చల మనుచు స్మరియించు
   వారల అహము నిర్మూలింపు మరణాచలా ॥అరు॥
2. అళగు (అంద) సుందరముల వలె చేరి నేను నీ
   వుంద మభిన్నమై యరుణాచలా ॥అరు॥
3. లోదూరి లాగి నీ లో గుహను చెరగా
   సమరించితేమొకో - అరుణాచలా ॥అరు॥
4. ఎవరికిగా నన్ను ఏలితి విడిచిన
   అఖిలము నిందించు అరుణాచలా ॥అరు॥

5. ఈ నింద తప్పు నిన్నేటికి తలపించి
తిక విడువారెవరు - అరుణాచలా ॥అరు॥

6. కనిన జనని కన్న ఘనదయా దాయాకా
ఇదియా అనుగ్రహ మరుణాచలా ॥అరు॥

7. నిన్నే మార్చి యరుగనీక యుల్లము
పైని ఉఱుదుగా నుండుమా అరుణాచలా ॥అరు॥

8. ఊరూరు తిరుగక ఉల్లము నినుగని
యణగ నీ ద్యుతి జూపు మరుణాచలా ॥అరు॥

9. నను చెఱపి యిపుడు నను కలువక విడు
టిది మగతన మొక్కొ యరుణాచలా ॥అరు॥

10. ఏటి కీ నిదుర నన్నితరులు లాగగ
యిదినీకు న్యాయమా - అరుణాచలా ॥అరు॥

11. పంచేంద్రియ ఖలులు మదిలోన దూరుచో
మదిని నీ వుండవో అరుణాచలా ॥అరు॥

12. ఒకడవౌ నిను మాయ మొనరించి వచ్చువా
రెవరిది నీ జాల మరుణాచలా ॥అరు॥

13. ఓంకార వాక్యార్థ ఉత్తమ సమహీన
నిన్నెవ రెరుగువా రరుణాచలా ॥అరు॥

14. అవ్వ బోలె యొసగి నాకు నీ కరుణ న
న్నేలుట నీ భార మరుణాచలా ॥అరు॥

15. కన్నుకు కన్నయి కన్ను లేక కనునిన్
గనువారెవరు గను మరుణాచలా ॥అరు॥

16. కాంత మినుము వలె గవిసినన్ విడువక
కలసి నాతో నుండు మరుణాచలా ॥అరు॥

17. గిరిరూప మైనట్టి కరుణా సముద్రమా
కృప జేసి నన్నేలు మరుణాచలా ॥అరు॥

18. క్రింద మీ దెటను చెన్నొందు కిరణమణి
నా క్రిందుగతి మాపు మరుణాచలా ॥అరు॥

19. కుట్ర మంతయు గోసి గుణముగా పాలించు
గురురూపమై వెలుగరుణాచలా ॥అరు॥

20. కూచి వాల్గన్నుల కోత పడక కృప
చేసి నన్‌చేరి కావరుణాచలా ॥అరు॥

21. వంచకా వేడియున్ కొంచమున్ కరుగవే
అభయ మం చేలుమా - అరుణాచలా ॥అరు॥

22. అడుగ కిచ్చెడు నీదు అకళంకమగు కీర్తి
హాని సేయక బ్రోవు మరుణాచలా ॥అరు॥

23. హస్తామలక నీదు సద్రసమున సుఖో
న్మాద మొందగ యేలు మరుణాచలా ॥అరు॥

24. వల నుంచి భక్తుల పరిమార్చు నిను గట్టు
కొని యెట్లు జీవింతు నరుణాచలా ॥అరు॥

25. కోపరహితగుణ గురిగాగ ననుగొను
కొఱయేమి చేసితి నరుణాచలా ॥అరు॥

26. గౌతమ పూజిత కరుణాఘన నగమా
కడగంట యేలుమా అరుణాచలా ॥అరు॥

27. సకలము కబళించు కరకాంతియిన
మనోజలజ మలర్చుమా - అరుణాచలా ॥అరు॥

28. తిండిని విన్జేరితిని తిన నానేను
శాంతమై పోవుదు నరుణాచలా ॥అరు॥

29. మదిచల్లపడ భద్రకరముంచి యమృతనోర్
తెరు మనుగ్రహచంద్ర అరుణాచలా ॥అరు॥

30. వన్నెను చెఱపి నిర్వాణ మొనర్చి కృ
పావన్నె నిడి బ్రోవు మరుణాచలా ॥అరు॥

31. సుఖ సముద్రము పొంగ వాఙ్మనము లడంగ
యూరక సమరు మందరుణాచలా ॥అరు॥

32. వంచింతు వేల నన్ శోధింప కిక నీదు
జ్యోతిరూపము జూపు మరుణాచలా ॥అరు॥

33. పద విద్య గరపి ఈ భూమి మైకము వీడి
రూపగు విద్య జూ పరుణాచలా ॥అరు॥

34. చేరకున్నను మేను నీరుగ కరిగి క
న్నీటేరయి నశింతు నరుణాచలా ॥అరు॥

35. ఛీయని త్రోసిన చేయు కర్మ తపన
గాకేది మనుమార్గ మరుణాచలా ॥అరు॥

36. చెప్పక చెపి నీవు మౌనత నుండని
యూరక నుందువే అరుణాచలా ॥అరు॥

37. సోమరి యైతిని మిన్నని సుఖనిద్ర
కన్న వేఱెది గతి యరుణాచలా ॥అరు॥

38. శౌర్యము జూపితి శమియించె ననిమాయ
చలియింపకున్నావు- అరుణాచలా ॥అరు॥

39. కుక్కకు నీచమే నేనే గుర్తు గొని
వెదికి నిన్జేరుదు నరుణాచలా ॥అరు॥

40. జ్ఞానము లేక నీ యాశ దైన్యము బాప
జ్ఞానము తెలిపి బ్రో వరుణాచలా ॥అరు॥

41. తేటి వలెను నీవు వికసింపలేదని
యెదుట నిలుతువేల అరుణాచలా ॥అరు॥

42. తత్త్వమెరుగ జాల నంతను నిలుతునే
యిది యేమి తత్త్వమో యరుణాచలా ॥అరు॥

43. తానేను తానను తత్త్వ మిద్దానిని
తానుగా జూపింతు వరుణాచలా ॥అరు॥

44. త్రిప్పి యహంతను యెప్పుడు లో దృష్టి
గన తెలియు ననుదే యరుణాచలా ॥అరు॥

45. తీరముండని యెద వెదకియు తన్ను నే
తిరిగి, బొందితి బ్రోవు మరుణాచలా ॥అరు॥

46. సత్యజ్ఞానము లేని యీ జన్మ ఫలమేమి
యొప్పగ రావేల యరుణాచలా ॥అరు॥

47. శుద్ధ వాఙ్మనయుతులం దోచు నీ నిజా
హంత గల్పి నను బ్రో వరుణాచలా ॥అరు॥

48. దైవమనుచు దరిజేరగా నన్ను
పూర్ణనాశ మొనర్చి తరుణాచలా ॥అరు॥

49. వెదుకక గనిన సచ్ఛ్రీయనుగ్రహ నిధీ
మది తెగుల్ తీర్చి బ్రో వరుణాచలా ॥అరు॥

50. ధైర్యము పరుగిడు నీ నిజాహమరయ
నేనాశ మైతి బ్రో వరుణా చలా ॥అరు॥

51. తాకి కృపాకరము నను కలియకున్న
నిజము నశింతు బ్రో వరుణాచలా ॥అరు॥

52. దోషరహిత నీవు నాతో నైక్యమయి ని
త్యానంద మయమొనర్పరుణాచలా ॥అరు॥

53. నగకు ఎడము కాదు నిన్వెదకిన నన్ను
గను కృపా నగ వేసి యరుణాచలా ॥అరు॥

54. నానలేదె వెదుక నేనయి నీ వొంటి
స్థాణువై నిలిచితి వరుణాచలా ॥అరు॥

55. నీ జ్వాల గాల్చినన్ నీఱు సేసెడు మున్నె
నీ కృపవర్షింపు మరుణా చలా ॥అరు॥

56. నీవు నేనణగ నిత్యానందమయముగ
నిలుచు స్థితి కరుణింపరుణాచలా ॥అరు॥

57. అణురూపు నిన్ను నే మిన్ను రూపుం జేర
భావోర్మ్మలెపుడాగు నరుణాచలా ॥అరు॥

58. సూత్రజ్ఞానము లేని పామరు నా మాయా
జ్ఞానము గోసి కా వరుణాచలా ॥అరు॥

59. మక్కిమక్కి కరిగి నే నిన్ను శరణంద
నగ్నుడవై నిల్చి తరుణాచలా ॥అరు॥

60. నేస్త ముండని నాకు నీయాశ జూపి నన్
మోసగింపక బ్రోవు మరుణాచలా ॥అరు॥

61. నవిసి చెడు ఫలము నందేమి ఫలమేది!
పక్వత లోగొను మరుణాచలా ॥అరు॥

62. నొవ్వగింపక నిన్ను నొసగినన్ గొనలేదె
యంతకుడవునాకు నరుణాచలా ॥అరు॥

63. చూచి చింతించి మేనుందాకి పక్వము
చేసి నీ వేలి బ్రో వరుణాచలా ॥అరు॥

64. మాయా విషము పట్టి తలకెక్కి చెడు మున్నె
కరుణ పట్టొసగి బ్రో వరుణాచలా ॥అరు॥

65. గనుకృపన్ మాయాంతముగ కృప గనవేని
గను నీకెవరు చెప్పు టరుణాచలా ॥అరు॥

66. పిచ్చివీడ నిను బోల్ పిచ్చి జేసితె దయన్
పిచ్చిని మాన్పు మందరుణాచలా ॥అరు॥

67. నిర్భీతు నిను జేరు నిర్భీతు ననుజేర
భీతి నీ కేలకో అరుణాచలా ॥అరు॥

68. అల్పజ్ఞాన మదేది సుజ్ఞాన మేదయా
ఐక్యమంద కరుణిం పరుణాచలా ॥అరు॥

69. పూ(భూ)గంధమగు మది పూర్ణ గంధము గొన
పూర్ణగంధ మొసగు మరుణాచలా ॥అరు॥

70. పేరు దలపగనే పట్టి లాగితివి నీ
మహిమ కనుదు రెవ రరుణాచలా ॥అరు॥

71. పొగ భూతము పోని భూతమై పట్టినన్
భూతగ్రస్తుని జేసి తరుణాచలా ॥అరు॥

72. మృదులతన్ నేప్రాపు లేక వాడగ నీక
పట్టుకొమ్మయి కావు మరుణాచలా ॥అరు॥

73. పొడిచే మయికపర్చి నా బోధ హరియించి
నీ బోధ కనుపించి తరుణాచలా ॥అరు॥

74. పోకరాకలు లేని సమరంగ దివి జూపు
మా కృపా పోరాట మరుణాచలా ॥అరు॥

75. భౌతికమౌ మేని పట్టార్చి యెపుడు నీ
మహిమ గన కరుణిం పరుణాచలా ॥అరు॥

76. మలమందు నీవియ్య మలగుటయే కృపా
మలమందువై వెలు గరుణాచలా ॥అరు॥

77. మానముగొని చేరువారి మానము
బాపి! నిరభిమానత వెలుగరుణాచలా ॥అరు॥

78. మించగా వేడెడు కించిజ్ఞుడను నను
వంచింపకను బ్రోవు మరుణాచలా ॥అరు॥

79. నావికుడుండక పెనుగాలి నలయు నా
వనుగాక కాచి బ్రో వరుణాచలా ॥అరు॥

80. ముడి మూలమున్ గాన, మును కొంటివి,
సరిగ ముగియ భారము లేదో యరుణాచలా ॥అరు॥

81. ముక్కిడి మునుజూపు ముకురము గాన నన్
హెచ్చించి కౌగలింపరుణాచలా ॥అరు॥

82. సత్యాహమున మనో మృదుపుష్ప
శయ్యపై మేన్గలియ కరుణింపరుణాచలా ॥అరు॥

83. మీదుమీదుగ మ్రొక్కు భక్తుల జేరి
నీవందితే మేలిమి యరుణాచలా ॥అరు॥

84. మైమైదణచి కృపాంజమున
నీ సత్యవశమెనరించితి వరుణాచలా ॥అరు॥

85. మొగ్గ(బోడి) పటిపి నను బట్ట బయట నీవు
నట్టాడు టేలకో అరుణాచలా ॥అరు॥

86. మోహము తప్పి నీమోహమొనర్చి నా
మోహము తీరదా యరుణాచలా ॥అరు॥

87. మౌనియై రాయిగా నలరక నున్నచో
మౌనమిది యగుచో యరుణాచలా ॥అరు॥

88. ఎవరు నా నోటిలో మన్నును గొట్టి నా
బ్రతుకు హరించిన దరుణాచలా ॥అరు॥

89. ఎవరు గనుక నాదు మదిని మైకపరిచి
కొల్లగొనిన దెవ రరుణాచలా ॥అరు॥

90. రమణుడనుచు నంటి రోషము గొనక నన్
రమియింప జేయ రమ్మరుణాచలా ॥అరు॥

91. రేయింబవలు లేని బట్ట బయటి యింట
రమియింపగా రమ్ము అరుణాచలా ॥అరు॥

92. లక్ష్యముంచి యనుగ్రహాస్త్రము వైచినన్
కబళించి తుసురుతో యరుణాచలా ॥అరు॥

93. లాభమీ విహపర లాభహీనుని జేరి
లాభమే మందితే వరుణాచలా ॥అరు॥

94. రమ్మని యనలేదె వచ్చినా వంతివ్వ
వెఱకు నీ తలవిధి యరుణాచలా ॥అరు॥

95. రమ్మని లో దూరి నీ జీవ మిడునాడె
నా జీవమును బాసి తరుణాచలా ॥అరు॥

96. విడిచిన కష్టమౌ విడక నిన్ను సురును
విడువ యనుగ్రహింపరుణాచలా ॥అరు॥

97. ఇల్లు విడువలాగి లో నింటిలో జొచ్చి
యొగి నీదు యిలు జూపి తరుణాచలా ॥అరు॥

98. వెలిపుచ్చితి న్నీదు సేత కినయక నీ
కృప వెలిపుచ్చి కా వరుణాచలా ॥అరు॥

99. వేదాంతమున వేరు లేక వెలింగెడి
వేద పదమ బ్రోవు మరుణాచలా ॥అరు॥

100. నింద నాశీస్సుగా గొని దయా పాత్రుగ
జేసి విడక కావు మరుణాచలా ॥అరు॥

101 నీట హిమముగా ప్రేమాకారు నీలోనన్
ప్రేమగ కరిగి బ్రో వరుణాచలా ॥అరు॥

102 అరుణాద్రియననే కృపావల బడితి త
ప్పునే నీ కృపావల యరుణాచలా ॥అరు॥

103. చింతింప కృప పడ సాలీడు వలె కట్టి
చెర పెట్టి భక్షించి తరుణాచలా ॥అరు॥

104. ప్రేమతో నీనామ మాలించు భ
క్తుల భక్తుగా బ్రోవు మరుణాచలా ॥అరు॥

105. ననుబోలు దీనుల నింపొంద కాచుచు
చిరంజీవివై బ్రోవు మరుణాచలా ॥అరు॥

106. ఎముకలరుగు దాసు మృదువాక్కు వినుచెవిన్
గొనుమ నాయల్పోక్తు లరుణాచలా ॥అరు॥

107. క్షమగలగిరి యల్పవాక్కు సద్వాక్కుగ
గొని కావు మరి యిష్ట మరుణాచలా ॥అరు॥

108. మాలను దయచేసి యరుణాచల రమణ
నామాల దాల్చి బ్రో వరుణాచలా ॥అరు॥

అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా
అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచల శివ అరుణాచలా

మంగళము

మంగళమరుణాచలమునకు
మంగళము భక్త శ్రేణికి
మంగళ మక్షరమణమాలకును జయమంగళము
ఓం నమో: భగవతే శ్రీ రమణాయ

........

# విజ్ఞప్తి

స్కాందపురాణాది శివపురాణాల ఆధారంగాను, కొందరు భక్తులు వ్రాసిన గ్రంధాల ఆధారంగాను మరియు వాటికి నేను స్వానుభవమును జోడించి "అరుణాచల మహిమ" అనే ఈ గ్రంధాన్ని రచించి తెలుగు భక్త లోకానికి అందించాను.

"స్మరణ మాత్రమునే పరముక్తి ఫలద
కరుణామృత జలధి అరుణాచల మిది"

కేవలము "అరుణాచలా!" అని స్మరించినంతనే ముక్తి కలుగు చుండగా ఇక అరుణాచల మహిమను చదివినా, విన్నా, ప్రచారము చేసినా ఎంత పుణ్యమో విలువ కట్టలేము. అందుచే భక్తులందరూ ఈగ్రంధాన్ని చదివి మరియు ఇతరులకు తెలియజేసి అరుణాచలుని కృపకు పాత్రులు కావాలని ఆశిస్తున్నాను.

ఇట్లు
రచయిత
**పులిచెర్ల ఆదినారాయణ, M.A.,**

# అంకితము

తే॥గీ॥ శ్రీకరాకారమూర్తియై చెలగుచున్న
సర్వవ్యాపకుడైనట్టి సదయ శివుడు
దీనజనులను బ్రోవంగ దీక్షబూని
వెలసె ధరలోన జ్యోతియై వేడ్కమీర

సీ॥ ఏనీమధుర నామ మేనాడు భక్తితో
తలచిన బంధసంతతులు పాయు
ఏనీ శుభాకార మీక్షింపనేత్రాల
కఖిలార్థ లాభంబు కలుగుచుండు
ఏనీప్రదక్షిణ లింపార చేసిన
కోరినవరము చేకూరుచండు
ఏనీమహిమలు కర్ణేంద్రియంబులు తాక
దేహతాపంబులు తీరుచుండు
అట్టి నీదు మహిమను వ్రాయంగ నేర్పె
రమణదేవుడు కరుణతో రమ్యముగను
అంకిత మరుణాచల శివా! అందుకొనుము
పాదపద్మాల నుంచాము భక్తిమీర

తే॥గీ॥ అజసురేంద్రాదులు పొగడ అలవికాని
నీదు చరితను వ్రాశాను నేర్పుమీర
చదువు వారల భవమును చక్కజేసి
కావు మరణాచలేశ్వరా! కరుణతోడ

# విషయ సూచిక

# అరుణాచలుని ఆవిర్భావము

ఏకమై, అద్వితీయమై విరాజిల్లే "కురుణా సముద్రుడగు పరమేశ్వరునకు ఒకమారు తాను అనేకము కావాలనే సంకల్పము కలిగింది. ఆ సంకల్పానుసారం పరమాత్మనుండి బ్రహ్మవిష్ణువులు పుట్టారు. బ్రహ్మదేవుడు లోకాలను సృజించుటకు, విష్ణువు వాటిని రక్షించుటకు పరమేశ్వరునిచే నియమితులయ్యారు. ఐతే, పరమేశ్వరుని ఆజ్ఞానుసారం బ్రహ్మవిష్ణువులు తమవిధులను నిర్వహించుటకు బదులుగా ఒకమారు అహంకారపూరితులై "నేను గొప్పయంటే, నేను గొప్ప" యని పరస్పరము పోట్లాడుకోసాగారు. వారి తగువును సాక్షీస్వరూపుడైన పరమేశ్వరుడు చూశాడు. ఇట్లను కొన్నాడు "నేను వెంటనే వీరి తగువును మాన్పాలి. లేనియెడల సృష్టికార్యమునకు ఆటంకము కలుగును. నాశక్తి అంతటా నిండియున్నది. ఈశక్తియే సృష్టికి మూలము. దీనిని మించినది లేనేలేదు. ఇది వేదసమ్మతమైన వైదిక సత్యము. ఈ ధర్మాన్ని బ్రహ్మవిష్ణువులు అహంకారము చేత ఆవేశపూరితులై మరచి పోయారు. తామే అధికులమన్నట్లు భావించి పరస్పరము పోట్లాడుకొంటున్నారు. ఇది తగనిపని. ఈసృష్టిలో ప్రతిపాణి అణుకువ కలిగియుండాలి. తమకంటే శ్రేష్టతమములైనవి ఎన్నియో వున్నాయని సమ్మతించాలి. ఇతరుల సమానత్వమును గానీ, ఆధిఖ్యతనుగానీ సమ్మతింపనివాడు నిజముగా అజ్ఞాని. అట్టివాడు తప్పక ఆపదలలో చిక్కుకొనును. పరాభవమును పొందును. పతనమౌను. ఈ ధర్మసూక్ష్మాన్ని బ్రహ్మవిష్ణువుల మూలంగా లోకాలకు తెలియజేయాలి. నన్ను తలచినంత మాత్రాన అల్పులను కూడా తరింపజేస్తూ ఈవిశ్వములో ఏదోయొకచోట ప్రత్యేకరూపాన్ని ధరించి వుండిపోవాలనే కోరిక నాకుండేది. ఇప్పుడు అందుకు తగిన సమయము వచ్చింది" అని పరమశివుడు నిశ్చయించుకొని తేజోవంతమైన జ్యోతిస్తంభముగా కలహించుకొనే చూచి

బ్రహ్మవిష్ణువుల మధ్యనిలిచాడు.

అనంతమైన ఆదివ్య తేజస్స్తంభాన్ని బ్రహ్మవిష్ణువులు చూశారు. భయకంపితులై ఊరక చూస్తూవుండిపోయారు. ఇంతలో అందుండి దేవవాణి వినిపించింది. "ఓ కుమారులారా! ఎందుకు ఈ బుద్ధిమాలిన తగవు? మీ బలాబలాలు పరమేశ్వరునకు తెలుసు. మీయెదుట తేజోవంతంగా ప్రకాశించే ఈ జ్యోతిస్స్తంభము ఏదోకాదు. ఇది పరమశివుని యొక్క స్వరూపము. దీని ఆద్యంతములను మీలో ఎవరు కనుగొందురో వారే గొప్పవారు" అన్న పరమేశ్వరుని పలుకులు విని బ్రహ్మ విష్ణువులు కలహమును మాని నీటిలో కనిపించే చంద్రబింబమును పట్టుకొనుటకు ప్రయత్నించే మూఢుల్లాగా ఆ స్తంభము యొక్క ఆద్యంతములను కనుగొనుటకు సిద్ధమయ్యారు. తమ బలాబలాలను నిరూపించుకొనుటకు పూనుకొన్నారు. అంతేగానీ! పరమేశ్వరుని స్తుతించాలను తలంపే వారికి కలుగలేదు. ఇక వారు భూమిని కేంద్రంగా తీసుకొన్నారు. విష్ణువు తేజస్స్తంభము యొక్క అంతమును కనుగొనుటకు సిద్ధమయ్యాడు. అందుకోసం ఆయన వరాహరూపమును ధరించాడు. భూమిని త్రవ్వుకుంటూ దాని వెంట పోయాడు. పోవుకొలది ఆజ్యోతిస్స్తంభము క్రిందకు అనంతంగా వ్యాపించిపోతూనే వుంది. లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని ఎంతో ప్రయత్నించాడు. చివరకు బలము తగ్గింది. అలసట హెచ్చింది. శరీరము పూర్తిగా డస్సింది. వెనుకకు తిరిగి వచ్చుటకు కూడా శక్తిలేదు. ఈవిధంగా విష్ణువు ఆపదలో చిక్కుకొన్నాడు. ఇప్పుడు ఆహంభావనంతా పోయింది. వెంటనే పరమేశ్వరుని ఎఱుక విష్ణువునకు కలిగింది. అప్పుడు తనలోతాను ఇట్లనుకొన్నాడు. "ఆహా! ఏమి ఈయహముయొక్క మాయ. దీనిచేత ఆదిదైవతమై, ద్రష్టగా నాలో వెలిగే పరమేశ్వరున్నే మరచిపోయాను. ఈసృష్టినంతా నేనే రక్షిస్తున్నాను. దీనికి కర్తను నేనే నాకంటే అధికుడు లేడని గర్వించాను. "నేను, నాది" అనే అహంతత్వముతో పరమేశ్వరున్ని పూర్తిగా మరచి పోయాను. నిజంగా దేవతలకు, వేదాలకు, సమస్తవిశ్వానికి ఆధారము ఆపరమాత్మ ఒక్కడే. ఆపరమేశ్వరుడే ఆదిదైవము. నేను అజ్ఞానము చేత అసహ్యమైన

పందిరూపమును ధరించి అనంతుడైన (పేమ శివుని అంతము కనుగొనుటకు ప్రయత్నించానే! ఇది సాధ్యమా! ఇది కేవలం పరమేశ్వరుని అనుగ్రహము చేతనే సాధ్యము. ఇప్పుడు సత్యము తెలియవచ్చినది. పరమశివుడు తనభక్తున్ని రక్షించాలని తలచినంత మాత్రాన ఆభక్తునిలోని అహము పారిపోతుంది. ముక్తి లభిస్తుంది. ఇది ముమ్మాటికీ సత్యము ఇప్పుడు ఈతేజస్తంభమును పూజించాలంటే నాకు తగిన శక్తిగానీ, సమయంగానీ లేదు. ఆయనకు శరణుజొచ్చుటే తగిన పని" అని నిశ్చయించుకొని తనలో తాను మునిగి పరమేశ్వరున్ని ధ్యానించాడు. శరణుజొచ్చాడు. అంత కరుణా సముద్రమైన పరమేశ్వరుడు విష్ణువును అనుగ్రహించి భూకేంద్రానికి చేర్చాడు.

ఇక బ్రహ్మ హంసరూపమును ధరించి తేజస్తంభము యొక్క మొదలును కనుగొనుటకు భూమి నుండి ఆకాశమునకు కొన్ని వేల సంవత్సరాలు ఎగురుతూ పోయాడు. కానీ ప్రయోజనము లేదు. ఎగిరి ఎగిరి రెక్కలు పాడైపోయాయి. ఆయాసము హెచ్చింది. ఇంద్రియాల బలము బాగా తగ్గింది. చూపు కనిపించడం లేదు. తాను ఎత్తుకు పోవుకొలది ఆతేజము ఇంకా ఎత్తుకు వ్యాపిస్తూనే వున్నది. ఇంత జరిగినా బ్రహ్మ మాత్రము తన ప్రయత్నాన్ని మానలేదు. గగనానయున్న సిద్ధ పురుషులు, బ్రహ్మయవస్థను, పట్టుదలను చూశారు. విస్తుపోయారు. వారు ఈవిధంగా అనుకొన్నారు. "ఏమి ఈ బ్రహ్మఅహంకారపు వ్యర్థపు ప్రయత్నము! శరీరము పడిపోవుటకు సిద్ధంగా వున్నది. ఐతే, ఆయనలోని అహంకామము చావలేదు. అందుకే ప్రయత్నము మానలేదు. నిజంగా శివస్వరూపానికి ఆద్యంతములు లేవు. అందుచేత దానిని కొలవడానికి ఎవరికినీ సాధ్మము కాదు. కానీ, అహంకారము తొలగినపుడు ఆయన అనంతమైన తత్త్వము తెలియవస్తుంది. పరమేశ్వరుని స్వరూపమైన ఈ తేజోరాశి ఆద్యంతములు తెలియాలంటే మొదట తనలో తాను మునిగి పరమేశ్వరుని ధ్యానించాలి. ఆయన కరుణతో అహం అంతమౌతుంది. అప్పుడు ఆత్మస్వరూపము తెలియవస్తుంది. ఆస్వరూపము ఏదోకాదు అది పరమేశ్వరుని స్వరూపమే. అప్పుడు మాత్రమే తేజస్తంభము

యొక్క అవధులను తెలుసుకొన్నవాడౌతాడు." అని సిద్ధపురుషులు చర్చించుకొనుచుండగా వారి పలుకులను బ్రహ్మ విన్నాడు. వెంటనే జాగ్రత్త కలిగింది. తన జన్మకు మరియు సృష్టికి కారణమైన పరమేశ్వరుని ఎఱుక కలిగింది. తనపొరబాటునకు వగచి ఇట్లనుకొన్నాడు. "ఆహా! ఏమివింత! పరమేశ్వరుని సంకల్పము వలన మేము పుట్టాము. ఆయన కరుణచేతనే ఈవిశ్వాన్ని సృష్టించి రక్షిస్తున్నాము. ఇదంతా పరమేశ్వరుని లీలావిలాసమనీ, ఆయనే సమస్తానికి ఆధారమని మరచి అహంకారముతో ఏకమై మేమే కర్తలమన్నట్లు భావించి పోట్లాడుకొన్నాము. మా అహంకారమును పోగొట్టి పరమాత్మసమ్మతమైన విధేయతను కలింగించుటకే ఈశ్వరుడు జ్యోతిస్స్తంభముగా మాయెదుట నిలిచాడు. నిజంగా మా జన్మలు ధన్యమయ్యాయి" అని గ్రహించి బ్రహ్మ వేదమంత్రాలతో పరమశివున్ని స్తుతించాడు. తరువాత ఆత్మనిష్ఠతో పరమేశ్వరుని శరణంది ఆయన కరుణకు పాత్రుడై తిరిగి భూకేంద్రాన్ని చేరుకొన్నాడు.

ఇదంతా స్కాందపురాణ పూర్వభాగమందు వివరింపబడెను. నందికేశ్వరుడు లింగపురాణములో మాత్రము బ్రహ్మ ప్రయత్నమును గూర్చి కొంచెము విభిన్నంగా వివరించాడు. అదేమనగా :- బ్రహ్మ తేజస్స్తంభపు అంతమును కనుగొనలేక నీరసించి పోయాడు. ఇంతలో గగనతలము నుండి వస్తున్న మొగలిరేకు మరియు కపిలగోవు బ్రహ్మకు కనిపించాయి. వారిని చూచి బ్రహ్మ, "మీరెవరు? ఎక్కడనుండి వస్తున్నారు?" అని ప్రశ్నించెను. నేను మొగలిపూవును సుగంధ సంభరితమైన దానిని. ఇదేమో గోవు. మేమిరువురము శివుని ఆజ్ఞానుసారము చాలా కాలము నుండి శివస్వరూపమైన తేజస్స్తంభము తలమీద వుండేవారము. ప్రపంచాన్ని చూడాలని ఆశపడి అటనుండి క్రిందకు వస్తున్నాము.." అని కేతకి సమాధాన మిచ్చెను. "ఐతే, ఈ స్తంభపు అంతము ఇచ్చటకు ఎంత దూరమున వుండును." అని బ్రహ్మ అడిగెను. అంత మొగలి పూవు నవ్వి, "నీవెవరవు? ఏమీ తెలియనట్లున్నావు. ఈ శివస్వరూపానికి ఆదిగాని, అంతముగాని

లేదు. బ్రహ్మాండములన్నీ ఇందులో వున్నాయి. దీని స్వరూపము అనంతము. లెక్కింప సాధ్యము కాదు. మేము క్రిందకు బయలు దేరి ఇప్పటికి కొన్నివేల చాతుర్యుగాలు గడచి పోయాయి. కానీ భూకేంద్రాన్ని చేరలేకున్నాము" అనెను. అంత బ్రహ్మసంతోషించి వారికి నమస్కరించి ఇట్లనెను. "ఓదివ్య స్వరూపులారా! నేను బ్రహ్మను. సృష్టికర్తను. అహంకారముతో విష్ణువునకు, నాకు తగవు ఏర్పడింది. అందుచే పరమేశ్వరుని మహిమను మరచిపోయాము. మా బలాలాలను నిరూపించుకొనుటకు ఈ తేజస్త్సంభము యొక్క ఆద్యంతములను కనుగొనుటకు పూనుకొన్నాము. విష్ణువైతే వరాహరూపము ధరించాడు నేను హంసరూపం ధరించాను. విష్ణువు సంగతి ఏమియోగాని, నేను మాత్రం తేజస్త్సంభపు అంతమును కనుగొనుటకు కొన్ని వందల వేల సంవత్సరాల నుండి ప్రయాణము సాగిస్తున్నాను. ఫలితము శూన్యము. శక్తి పూర్తిగా చచ్చిపోయింది. ఈక్లిష్ట పరిస్థితిలో మీతో కలవడం సంభవించింది. నేను నిస్సహాయుడను. నాకు దిక్కెవరూ లేరు. మీరే నాకు రక్ష. నాకోరికను మన్నించండి. విష్ణువు స్త ంభపు అంతమును కనుగొనెనా నేను ఓడిపోవుదును. కనుగొనలేక పోయెనా మేమిద్దరమూ సమాన మగుదుము. ఈరెండూ నాకు ఇష్టము కాదు. అందుచేత మీరిద్దరూ నాకు సాయం చేయాలి. మీరు శివుని శిరముపై వుండేవారు కదా! ఈ తేస్త్సంభపు శిఖరమును నేను చూచినట్లుగా మీరు సాక్ష్యమివ్వండి దాని చేత నేను విష్ణువు కంటే అధికుడనగుదును" అని వారిని ప్రార్థించి సమ్మతింపజేసెను.

బ్రహ్మదేవుడు వారితో కలసి వెనుదిరిగి వచ్చెను. విష్ణువు జ్యోతిస్త్సంభపు ఆదిని కనలేక పోయానని తన ఓటమిని అంగీకరించెను. ఐతే బ్రహ్మ మాత్రము తాను అంతమును చూడగలిగితినని అసత్యము పల్కెను. అందుకు మొగలిపూవు ఔను అని మరియు కపిల నోటితో ఔనంచూ తోకెత్తి కాదని అడ్డముగా కదల్చినది. అప్పుడు సదాశివుడు జ్యోతిస్త్సంభము నుండి ప్రత్యక్షమై అసత్యము పల్కినందులకు నీకు పూజలుండవని బ్రహ్మను శాసించెను. నా పూజకు పనికి రావని మొగలి

పూవును నిరసించెను. గోవు అబద్ధమాడినందులకు పూర్వభాగము అపావనమని మరియు మొదటి పూజకు అనర్హమనీ, ఐతే సత్యమును సూచించిన వెనుక భాగము పూజార్హమని, అందలి యోని సంచితము. గోమయము పావనులని కరుణించి పల్కెను. విష్ణువు యొక్క సత్యవాక్కునకు మెచ్చి పరమశివుడు తన సుదర్శన చక్రమును విష్ణువునకు బహూకరించెను ఇక బ్రహ్మవిష్ణువులు ఇరువురు శివపరమాత్మకు శణాగతులైరి.

ఇప్పుడు బ్రహ్మవిష్ణువులు ఇద్దరూ కలసి పరమశివున్ని ఈవిధంగా ప్రార్థించారు. "ఓ తేజోమూర్తి! పరమశివా! భూమ్యాకాశములు మరియు పాతాళములందు అనంతంగా వ్యాపించే తమ తోజోరాశిని మేము చూడలేము. కావున దయచేసి తమ తేజోమయశక్తిని భూమిపైకి మరల్చి పరిమితము చేయండి" అని ప్రార్థింపగా దయామయుడు భక్తసులభుడైన సదాశివుడు వారి ప్రార్థనను మన్నించి అపరిమితమైన తన తేజోకాంతిని వెనుకకు మరల్చి పరిమితమైన తేజస్తంభముగా భూమిమీద అవతరించాడు.

మార్గశిరమాసంలో (డిశెంబరు-జనవరి) ఆరుద్ర నక్షత్రమునాడు పరమేశ్వరుడు ఆజ్యోతిస్తంభముగా ధరలో వెలశాడు, బ్రహ్మవిష్ణువులు సర్వదేవతలు, సిద్ధులు, మునీశ్వరులు మున్నగువారందరు ఆకాంతిసంభాన్ని వేదోచితంగా ప్రస్తుతించారు. వైభవంగా పూజలు చేశారు. వారి పూజలను మన్నించి పరమశివుడు మాఘమాసంలో (ఫిబ్రవరి-మార్చి) చతుర్దశినాడు (పున్నము పోయిన తరువాత 14వ దినము) అందుండి వారికి ప్రత్యక్షమయ్యాడు. ఆరూపము చాలా మనోహరమైనది. ప్రకాశవంతమైన తెల్లని శరీరచ్ఛాయ, జడలు మరియు రుద్రాక్షమాలలను ధరించి, ఫాలమందు మూడు విభూతి రేఖలు మరియు వాటి మీద సుగంధ పరిమళమైన కస్తూరికా బొట్టు, మెడలో సత్త్వసంపన్నమైన సర్పాభరణము, ఒక చేతిలో త్రిశూల ఢమరకాలు, దుష్టశిక్షణ మరియు శిష్టరక్షణను సూచించే అభయహస్తం, సిగలో నెలవంక మరియు పలుచని వస్త్రమును ధరించి మురిపాల ముక్కంటి

వారికి దర్శనమిచ్చాడు. వరములు కోరుకోమన్నాడు. అప్పుడు బ్రహ్మవిష్ణువులు పరమశివున్ని ఈ విధంగా ప్రార్థించారు "ఓ ప్రభు! సర్వవ్యాపకా! పరమేశ్వరా! ఈ తేజస్తంభము యొక్క ప్రకాశము అమితమైనది. ఈదివ్యతేజోకాంతిని లోకాలు చూడలేవు. ఈతేజస్సును చూడటానికి భౌతిక నేత్రాలు పనికి రావు. అందుచే ఓవిశ్వరూపా! పరమశివా! మమ్ము కరుణించి లోక కళ్యాణము కోసము ఈకాంతికి మారుగా మనోహరమైన లింగాకృతి గల కదలని కొండగా "అరుణాచలము" అనే పవిత్రమైన పేరుతో ఈ భూమి మీద అవతరించండి. మీసన్నిధి మాత్రాననే అందరి భవరోగాలను తొలగించండి. కోరికలను తీర్చండి. సుఖాలనివ్వండి. కావలసిన వారికి మోక్షాన్ని ప్రసాదించండి" అని. అంత శివపరమాత్మ ప్రసన్నుడై వారి కోరికలను మన్నించి తన తేజస్తంభాన్ని అరుణాచలంగా మార్చుకొని ఈభూమి యందు ప్రాదుర్భవించాడు.

ఇక పరమేశ్వరుడు ప్రేమతో బ్రహ్మవిష్ణువులను చూచి, "ఓ కుమారులారా! మీకోసము నాచే అనుగ్రహించబడిన ఈ అరుణాచలము కడుపవిత్రమైనది. ఇది తేజోవంతమైన స్వయంభూనగము. మోక్షాన్ని ప్రసాదిస్తుంది. "అరుణాచలము" అని స్మరిస్తే చాలు సమస్త పాపాలు సమసిపోగలవు. ఈనా అరుణాచల నివాసం చేత ఈస్థలము పవిత్రపుణ్యక్షేత్రమౌతుంది. ఈక్షేత్రము చుట్టూ మూడు యోజనాల దూరమున (48 కి.మీ) నివసించే వారందరూ ఎట్టి సాధనగానీ, ఆచార వ్యవహారములుగానీ లేకయే తరించగలరు. సులభంగా నాలో ఒకరై పోగలరు. స్థావరజంగమాలు అనగా కదిలేవి మరియు కదలనివి అన్నీకూడా ఇక్కడున్నంత మాత్రముననే ముక్తిని పొందగలవు. దూరము నుండియే నన్ను చూచేవారు లేదా తలంచేవారు సమస్త వేదాంతసారమును సులభంగా తెలుసుకోగలరు. నాతేజోవంతమైన కాంతి ఈ అరుణాచల మందు ఎల్లప్పుడూ ప్రకాశిస్తూ, అనుగ్రహిస్తూ ఉంటుంది అరుణాచాలాన్ని నీరు ముంచలేదు. అగ్ని కాల్చలేదు. దేవతా శరీరాలన్నీ ఈ తేజోపర్వతము చుట్టు ఎల్లప్పుడు తిరుగుతూ

వుంటాయి. దూరము నుండియో లేక దగ్గర నుండియో తలవంచి నమస్కరిస్కే చాలు ముక్తిని పొందగలరు. అన్నిటికంటే "గిరిప్రదక్షిణ" నాకు చాలా ఇష్టము. గిరిప్రదక్షిణ చేస్తే చాలు సుఖశాంతులు లభిస్తాయి." అని అభియమిచ్చాడు.

బ్రహ్మవిష్ణువులు పరమశివుని పలుకులు విని సంతోషించి నమ్రతతో ఆయనకు తలవంచి నమస్కరించి మరలా ఇట్లు విన్నవించుకొన్నారు. 'ఓ లోకనాథా! పరంధామా! పరమేశ్వరా! భూలోకవాసులు క్షేమము కోసము ప్రతి సంవత్సరము కార్తీక మాసంలోకృత్తికా నక్షత్రము ప్రధానముగా గల పౌర్ణమి నాటి సంధ్యాసమయమున ఈ పర్వతము నుండి తేజోవంతమైన దీపంగా దర్శనమివ్వండి. ఆజ్యోతిని చూచిన వారిని ధన్యలను చేయండి". అంత పరమశివుడు వారి కోర్కెల మన్నించి, "అట్లేకానిమ్ము" అని అభయమిచ్చాడు.

అందుకు బ్రహ్మవిష్ణువులు సంతోషించి మరలా ఇట్లు విన్నవించుకున్నారు. "ఓ ప్రణవస్వరూపా! మహేశ్వరా! ఇంత పెద్దదైన అరుణాచలాన్ని సాధారణ మానవులు ఏ విధంగా పూజించగలరు? ప్రకృతి మరియు దేవతలైతే పూజించగలరు. వరుణుడు మేఘాల రూపములో వచ్చి నిన్ను అభిషేకించగలడు. నీ కొండచరియల్లో ఉండే వృక్షాలైతే సుగంధ పరిమళ పుష్పాలతో నిన్న అర్చించగలవు. సూర్య చంద్రులు దీపారాధన మరియు హారతులతో నిన్ను పూజించగలరు. మందమారుత పవనాలు వింజామరులుగా నీకు వీచి ఉపచారములు చేయగలవు. ఇదంతా సాధారణ మానవులకు సాధ్యమా! అందుచేత ఓ ప్రభూ! పరమేశ్వరా ఈ అరుణాచలానికి తూర్పున వేద సమ్మతంగా నిన్ను మంత్రాలతో అభిషేకించి పూజించడానికి తేజోలింగముగా అవతరించండి. ఆ శివలింగానికి మేము చేసే పూజలు గైకొని మమ్ము ధన్యులను చేయండి. మమ్మేకాదు. మిమ్ములను పూజించే వారినందరినీ కరుణించి అభీప్సితములను తీర్చండి." బ్రహ్మవిష్ణువుల అభిమతాన్ని పరమశివుడు మన్నించాడు. తననుండి మంగళప్రదమైన శివలింగాన్ని కల్పించాడు. బ్రహ్మాది దేవతలకు,మునులకు, గంధర్వులకు, విశ్వకర్మ

మున్నగు వారలకు పూజావిధానాన్ని మరియు ఆలయ నిర్మాణాన్ని వివరించాడు. దేవతలందరూ దేవతా శిల్పియైన విశ్వకర్మచే ఆ స్వయంభూతేజోలింగానికి ఆయలాన్ని కట్టించారు. పరమేశ్వరుడ చెప్పిన ప్రకారము బ్రహ్మవిష్ణువులు, అష్టదిక్పాలురు, దేవతలు , సిద్ధపురుషులు, మునీశ్వరులు మున్నగు మహితాత్ములందరూ ఆతేజోలింగాన్ని పూజించారు. ఇదంతా జరిగిన పిదప పరమేశ్వరుడు సంతసించి మానవరూపధారియై కౌపీనమును ధరించి అరుణగిరియోగిగా ఒక మఱ్ఱివృక్షము క్రింద ఆశీనుడై ధ్యాన నిష్ఠలో ఉండుటకు అరుణాచలమునకు వెళ్ళిపోయాడు.

ఈ విధంగా సర్వవ్యాపకుడు, తేజోస్వరూపుడైన పరమేశ్వరుడు భక్తులు మనసారా పూజించుటకు, అభిషేకించుటకు, ఆరాధించుటకు మరియు వారి పూజలను గైకొని ఆనందించుటకు అరుణాచలముగాను, జ్యోతిర్లింగముగాను, అరుణగిరియోగిగాను భూమిపై అవతరించాడు. ఇదే అరుణాచలుని అద్వితీయమైన ఆవిర్భావము. ఇదంతా మన ప్రసిద్ధ పురాణాలైన సూతసంహిత, స్కాందపురాణము, అరుణాచలపురాణము, లింగపురాణము మున్నగు ప్రసిద్ధ శివపురాణాలన్నీ మనోహరంగా వర్ణించి వివరించాయి.

ఏదిఏమైనా పరమేశ్వరుని అవతారమే ఈ అరుణాచలమని శివపురాణాలన్నీ చెబుతున్నాయి. అంతేకాదు చాలామంది సాధువులు, కవులు తేజస్స్తంభము యొక్క ఆద్యంతములను కనుగొనుటకు బ్రహ్మవిష్ణువులు ప్రయత్నించిన విధమును మనోహరంగా తమ కవితల్లో నుతించారు, పాడారు. అందుచే అరుణాచల ప్రాదుర్భావము కల్పితమని ఊహించుటకు వీలుకాదు. ఇది సర్వులూనమ్మదగిన విషయము. సత్యమైన సంఘటన.

అందుచేత ఈ సృష్టిలో అరుణాచలముతో సమానమైనది మరేదియునూ లేదు. ఈ లోకములో ఎందరో జ్ఞానులు, అవధూతలు, సిద్ధపురుషులు ఉండవచ్చు. కానీ వారు ఆయనతో సమానమని చెప్పవీలులేదు. అట్లు చెప్పడము శుద్ధతప్పు. అరుణాచలునితో

సమానమని తలంచడమే గొప్ప అజ్ఞానము. ఆయన నిరంతరము ప్రకాశించే అవధులులేని జ్యోతిస్స్తంభము. అజ్ఞానాంధకారమును తొలగించి జ్ఞానమనే వెలుగును ప్రసాదించే మహత్తర జ్యోతి స్వరూపమే ఈ అరుణాచలము. భక్తితో, నమ్మకముతో పూజించేవారు బ్రహ్మవిష్ణువులు చూచిన జ్యోతిస్స్తంభాన్ని ఈ కొండలో ఇప్పటికినీ చూడగలరు చూస్తున్నారు కూడా. భగవాన్ శ్రీరమణమహర్షులు అరుణాచలాన్ని గూర్చి ఈ విధంగా హెచ్చరిక చేశారు. "ఈ అరుణాచలాన్ని ఊరక చూచి, వెంటనే యిది రాళ్ళతోను, గుండ్లతోను, చెట్లూచేమలతోను కూడిన సాధారణ పర్వతమని మాత్రము భావించకండి. ఇది పరమేశ్వరుని స్వరూపము". దీనిని నిర్ధారించుటకు భగవానులు జ్ఞానసంబంధర్ వ్రాసిన తేవారాన్ని పేర్కొనేవారు. అందులో ఏమీ తెలియని పిల్లవాడు అరుణాచలాన్ని చూచి, "ఇది మహనీయమైన జ్ఞానస్వరూపము పరమేశ్వరుని అనంతమైన కరుణయే ఈ అరుణాచలము" అని అన్నాడట ఈ విషయాన్ని శ్రీరమణ భగవానులు భక్తులకు చెప్పేవారు.

సృష్టిచక్రము ప్రకారము మొట్టమొదట పరమేశ్వరుని సంకల్పము వలన బ్రహ్మవిష్ణువులు పుట్టారు. వారి వలన సృష్టియేర్పంది. ప్రళయకాలములో ఈ బ్రహ్మవిష్ణువులు తిరిగి పరమేశ్వరునిలో కలసిపోతారు. ఐతే అరుణాచలుడు మాత్రము దేనిలోను కలవడు స్థిరంగా వుంటాడు దీనిని బట్టి అరుణాచలుడు నిత్యుడు, నిరామయుడని మనము గ్రహింపవచ్చు. తేవారంలో ఈ విధంగా చెప్పబడింది. "ఎందరో బ్రహ్మలు, విష్ణువులు వుండవచ్చు ఐతే అరుణాచలుడు మాత్రము ఒక్కడే" ఇది వేదసమ్మతమైన అభిప్రాయము కూడా! ఇది ముమ్మాటికీ సత్యము.

కీ॥శే॥ జనమంచి శేషాద్రిశర్మగారు (కడప) "అరుణాచల ఖండము"లో బ్రహ్మవిష్ణువుల మధ్య వెలసిన తేజ స్స్తంభమును ఈవిధంగా వివరించారు. మూలము స్కాంద పురాణము.

క॥ జ్వలన స్తంభం బయ్యెది, జ్వలియించుచు సర్వలోక సర్వ స్థలముల్ గలయన్ మండంజేయుచు తుల యన లేనట్టి శక్తితో

వ్యాపింపన్.

తే॥ దానియంతము మొదలునుగాని గాన
జాలకవ్వార లిర్వురు చక్షువులొగి
నార్తిమునగ, నిశ్చేష్టులగుచు నుండి
రట్లు వెల్గు తేజస్స్తంభమును గనుచు

## ౨. పార్వతి అరుణాచలునిలో ఐక్యమగుట

అరుణాచలుడు భక్తసులభుడని, "అరుణాచలా!" అని స్మరించినంతనే పాపములు నశించి పుణ్యము చేకూరునని, మోక్షము కలుగునని, ఇక్కడ చేరి తపస్సు చేస్తే కోర్కెలు నెరవేరునని మనపురాణాలు వివరించాయి. ఇందుకు నిదర్శనంగా దేవతల గాధలను, మునీశ్వరుల కధలను, రాజుల వృత్తాంతములను ఎన్నింటినో పేర్కొన్నాయి. వీటిలో ముఖ్యంగా విశ్వమాతయైన పార్వతి ఒకమారు విధాతసృష్టికి భంగము కలిగించి, ఆపాపపరిహారార్ధము అరుణాచలమునకు వెళ్ళి తపమాచరించి, గిరిప్రదక్షిణచేసి పవిత్రురాలై అరణాచలునిలో ఐక్యమైన గాధ ఒకటి. దానిని గూర్చి తెలుసుకొందాము.

అది కైలాసపర్వతము. పార్వతీపరమేశ్వరులు ఒకమారు వేడుకగా అందు విహరిస్తున్నారు. అది వసంతకాలము. ప్రకృతంతా శోభయమానంగా వున్నది. వృక్షాలు, లతలు పుష్పించాయి. సువాసనను వెదజల్లే రంగు రంగుల పూలతో అలంకరించబడిన వనదేవత చూడ ముచ్చటగా వున్నది. పక్షుల కిలకిలారావములు, కోయిలల పంచమస్వరాలాపనలు వీనులవిందు చేస్తున్నాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యము చేస్తుంటే ఆభంగిమ చూడముచ్చటగా వున్నది. మృగాలు తమతమ స్వాభావిక క్రూర స్వభావాలు మాని అన్యోన్యంగా చందన వృక్షాల నీడన విహరిస్తున్నాయి. మలయపవనుడు సుగంధ పరిమళ సంభరితుడై గంగానది యందలి చల్లదనాన్ని మోసుకొని హాయిని గొలిపే పిల్లవాయువులతో అంతటా వ్యాపించి లాలిస్తున్నాడు. ప్రకృతంతా

పారవశ్యములో మునిగిపోయింది. ప్రమధగణాలు ప్రకృతి మనోహర వైభవానికి లోనై చిందులు వేస్తున్నారు. పార్వతి ఆ ప్రకృతి అత్యద్భుత వైభవాన్ని చూచి తన్మయత్వము చెందింది. అప్పుడు ఆమెను మోహపారవశ్యము ఆవరించింది. ఆమెలో వినోదమోద ప్రవృత్తి జనించింది. అందుకే ఆమె పరమశివుని వెనుక నుండి వచ్చి దోబూచులాటగా కళ్ళను మూసింది. "ఇప్పుడు నేనెవరినో కనుక్కోండి, చూద్దాం!" అన్నది. వెంటనే విశ్వమంతా అంధకార బంధురమయింది. గమనము గతిచింది. ఇదంతా రెండు నిమిషాలు జరిగింది. ఐతే, ఆ రెండు నిమిషాలే లోకాలకు కొన్ని వేల సంవత్సరాలయి పోయింది. అకాలములో విశ్వమంతా ఈ విపత్తుకు లోనుకావడం సిద్ధపురుషులు, దేవతలు చూచి విభ్రాంతి చెందారు. తమ దివ్య దృష్టితో ఇందుకు గల కారణాన్ని తెలుసుకొన్నారు. దేవతలు, మునీశ్వరులు, సిద్ధపురుషులు మున్నగు మహితాత్ములందరూ పరమేశ్వరున్ని ఈ విధంగా ప్రార్థించారు.

"ఓ బోళాశంకరా! పార్వతీదేవి వినోదకారణంగా ప్రపంచానికి ఈ విపత్తు కలిగింది. ఐతే, ప్రళయానికిది సమయము కాదు. ఇంకా లోకము యొక్క కాలపరిమితి దండిగా వున్నది. అందుచే మాపై దయయుంచి మా విన్నపాన్ని మన్నించి ఈ ఉపద్రవమును మాన్పండి ప్రపంచాన్ని రక్షించండి."

శంకరుడు వారి ప్రార్థనను విని మన్నించాడు. గౌరితో "ఓ పార్వతి! నాకళ్ళను విడువుము" అన్నాడు. వెంటనే పార్వతి చేతులను వదిలింది. తక్షణమే విశ్వానికంతా వెలుగు వచ్చింది. చైతన్యవంతమయింది.జగత్తు యధాప్రకారము నడిచింది. ఇక శివుడు ధర్మార్థపరంగా గౌరిని సున్నితంగా ఇట్లు మందలించాడు. "ఓదేవీ! నీవు విశ్వానికంతకూ తల్లివి. నీతనయులకు ఏఆపద కలిగినా తుదకది నీకే చెందుతుంది. అప్పుడు నీవు బాధపడక తప్పదు. ఇదంతా మరచి ప్రపంచానికి ఎందుకు ఈ కష్టాన్ని కలిగించినట్లు? నాకు అంతు తెలియకున్నది." అన్నాడు.

గౌరి తనకేదీ తెలియదని ఖిన్నవదనయై మిన్నకుండా

వుండిపోయింది. అప్పుడు శివుడు, "చూడు గౌరీ! ఇది విధాతసృష్టి ఆయన సృష్టిధర్మానికి ఎవ్వరూ విఘాతము కలిగించరాదు. అట్లు చేయుట మహాపాపము. అది తెలిసినదీ కావచ్చు లేక తెలియనిదీ కావచ్చు. లోకానికి హాని కలిగించిన వారు మాత్రం శిక్షను అనుభవింపక తప్పదు. ఇది వైదికశాసనం. వేదధర్మము ప్రకారము ఆపాపకర్మ పోవడానికి తపమాచరింపవలసి వుంటుంది. ఐతే ఆతపము వారికోసం కాదు ప్రపంచ శ్రేయస్సు కోసము" అని పరమశివుడు వివరించాడు.

ఇదంతా పార్వతి విన్నది. తన పొరబాటుకు బాధపడింది ఆపాపపరిహార్ధము భూలోకములో తపమాచరిస్తానని శంకరున్ని ప్రాధేయపడింది. అందుకు శివుడు, "ఓ పార్వతీ! నేను నీ ఆత్మను. నన్ను వదలి వెళ్ళి తపము చేయుమని నేను నీకెలా చెప్పేది? నీవు జగన్మాతవని దేవతలందరూ నీశక్తిని గూర్చి పొగడుచున్నారు. అందుచే నిన్ను వదలి నేను విశ్వాత్మగా ఒక్కక్షణం కూడా వుండలేను ఐనా, ఇది తప్పనిది. ఇది వైదిక ధర్మము. విధాత శాసనము. కాన దానిని మీరరాదు నీ యెడబాటనే కఠోర తత్వాన్ని నేను సహింపక తప్పదు. ఎందుకంటే నీ తపోమహిమచే జగాలన్నీ పవిత్రము కాగలవు. కావున ఓ పరమేశ్వరీ! నీవు కాంచీపురానికి వెళ్ళి తపమాచారింపుము అది భూలోక స్వర్గము. అక్కడ తపస్సు చేస్తే గొప్ప ఫలము చేకూరుతుంది. కంపానదీ తీరాన గొప్ప మామిడి వృక్షము కలదు. అది ఫలపుష్పసంభరితము. దాని నీడన దేవతందరూ నివసించి వుంటారు. అందుచే నాయెడబాటు నీకు బాధాకరంగా వుండదు" అని వివరించాడు.

పరమశివుని ఆజ్ఞానుసారం పార్వతి కైలాసము నుండి కాంచీపురానికి వచ్చింది. కంపానదీ తీరాన మామిడి వృక్షచ్ఛాయన తపము ప్రారంభించింది. తీరాన సైకతలింగాన్ని ఏర్పాటు చేసుకొని పూజించింది. ఇలా కొంతకాలము గడచిపోయింది. పరమశివుడు ఆమె తపోమహిమను పరీక్షింపదలచాడు తద్వారా పార్వతి యొక్క తపోశక్తిని లోకాలకు చాటాలనుకొన్నాడు. నదీరూపములో ఉప్పొంగి వచ్చి ఆయిసుక లింగాన్ని ముంచి వేయాలని ప్రయత్నించాడు. పార్వతి ఇది

ఆలింగాన్ని గట్టిగా తన రెండు చేతులతో పట్టుకొన్నది. అందుకు ఆ తరంగాలు సైకతలింగాన్ని తాకలేక పోయాయి. సాధ్యము గాక వెనుకకు వెళ్ళిపోయాయి. అప్పుడు శివుడు పార్వతి తపోమహిమను మెచ్చి ప్రత్యక్షమై, "ఓ లోకమాతా! గౌరీ! నీతపము మెచ్చదగినది. కాంచీపురమందు నీతపము విజవంతమైనది. ఇక అరుణాలానికి వెళ్ళి తపమాచరింపుము. అక్కడ నేను స్వయంగా తేజోవంతమైన జ్యోతిగా ప్రకాశిస్తూ సర్వులకు ముక్తిని ప్రసాదిస్తున్నాను. కోరిన కోర్కెలను తీరుస్తాను. అదే నాస్వరూపము. అదే నానిజమైన ఆవాసము. ముక్తిని పొంద తలచిన వారందరూ తప్పక అక్కడకు రావలసిందే. సర్వదేవతలు, మునీశ్వరులు, సిద్ధపురుషులు నన్ను నిరంతరం సేవిస్తూ అక్కడుంటారు. నీవు అరుణాచలానికి వెళ్ళి గౌతమ మహాముని వలన అరుణాలచలుని మహిమను మరియు పూజావిధానమును తెలసుకొని అరుణాచలుని భక్తి కలిగి తపము సాగింపుము. అప్పుడే నీతపమునకు సంపూర్ణత్వము సిద్ధించినట్లు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

పరమశివుని సందేశానుసారం పార్వతి అరుణాలానికి వెళ్ళి గౌతముని కడ అరుణాచల మహాత్యమును తెలుసుకొన్నిది. అరుణాచల భక్త శిఖామణుల కథలను విని సంతోషించింది. అందలి తీర్థాల పవిత్రతను తెలసుకొని పరవశించింది. ముఖ్యంగా గిరిప్రదక్షిణ యందలి ప్రాధాన్యతను తెలసుకొని మురిసిపోయింది. ఇక అరుణగిరి చెంత "అరుణాచల' స్మరణతో తపము ప్రారంభించింది. ఆ సమయములో ఆమెకు మహిషాసురునితో తగవు ఏర్పడినది. మహిషాసురుడు పార్వతి మీదకు యుద్ధానికి వచ్చాడు. పార్వతి తన తపమునకు అంతరాయము కలుగకుండా ఆయసురున్ని సంహరించుటకు తన నుండి దుర్గను సృజించి పంపింది. దుర్గ మహిషాసురునితో తలపడింది. వారిరువురకు 9 రోజులు భయంకరంగా యుద్ధము జరిగింది. పదవ రోజున దుర్గ మహిషాసురున్ని వధించింది. పవిత్రమైన అరుణాచలుని సమీపాన తాను చేసిన ఈ సంహార మనే పాపపరిహారార్థము అక్కడ తన ఖడ్గముతో రాతిని కొట్టి

నీటిని పుట్టించింది. అక్కడ ఒక తీర్థము ఏర్పాటు చేసి అందు ఖడ్గమును కడిగి పాపమును తొలచివేసింది. ఇకతాను అందలి పవిత్రమైన నీటిలో స్నానమాడి పవిత్రురాలయింది. తిరిగి దుర్గ పార్వతిలో ఐక్యమయింది. అక్కడ అంటే అరుణాచలుని సమీపాన దుర్గగుడి వెలసింది. అక్కడ ఇప్పటికిని ఇందుకు సంబంధించిన కొలను "ఖడ్గతీర్థము" అను పేరుతో పవిత్రంగా వున్నది.

ఇక పార్వతి అరుణాచల మందు తపస్సు చేసి కార్తీక మాసంలో కృత్తికా నక్షత్రమునాడు గిరిప్రదక్షిణ చేసింది. పార్వతి సల్పిన ఈ గిరిప్రదక్షిణను మన పురాణాలు ఎంతో మనోహరంగా వర్ణించాయి. బహుకాలము శోణాచలుని సన్నిధిలో వుంటూ తపము చేయుటవలన ఆమెకు మహోన్నతమైన ఆధ్యాత్మికజ్ఞానము కలిగింది. ఆజ్ఞానామృతాన్ని తన వెంటయున్న దేవర్షులకు పార్వతి పంచిపెట్టింది.

ఈ విధంగా పార్వతి అరుణాచలుని సన్నధిలో లోకకళ్యాణము కోసము తపమాచరించింది. లోకాలు సుఖించాయి. అరుణాచలుడు ఆమె తపమును మెచ్చి ప్రత్యక్షమయ్యాడు. వరములు కోరుకోమన్నాడు. లోకక్షేమం కోసము పార్వతి అరుణాచలున్ని ఈ విధంగా ప్రార్థించింది. "ఓ పరమేశ్వరా! అరుణాచలశివా! మెడలో నాగరాజు, చేతిలో పుర్రె, కంఠమందు విషము, శరీరమంతా బూడిదతో కూడిన ఆ భయంకర రూపము నాకు వలదు సుగంధ పరిమళాన్ని వెదజల్లే పూలవనాలతో కూడి మహదానందకరమై, పరిపూర్ణమైన ఈ అరుణాచల రూపంతో నాకు దర్శనమిస్తూ వుండండి. నాకే కాదు భక్తులందరకు మనోహరమైన అరుణాచల రూపంతోనే దర్శనమివ్వండి. నిన్ను పూజించు భక్తులు తెలిసో తెలియకో తప్పులు చేస్తే వారిని మన్నించి రక్షించండి. నేను అరుణాచలములో ఐక్యమై మహదానందమును అనుభవించాలని ఆశపడతున్నాను. కావున ఓ పరమశివా! తేజోస్వరూపా! అరుణాచలా! నన్ను తమలో ఐక్యము చేసుకొని అర్థనారీశ్వరునిగా సర్వులచే పూజలు గైకొని నన్ను ధన్యురాలుగా చేయండి.

కరుణాసముద్రుడు, దయానిధియగు అరుణాచలుడు ఆమె ప్రార్థనను

విన్నాడు. మన్నించాడు. "అట్లే కానిమ్ము" అని అభయమిచ్చాడు. వెంటనే పార్వతి అరుణాచలునిలో లీనమయింది. పార్వతీపరమేశ్వరుల దివ్యస్వరూపమే ఈ అరుణాచలము.

## 3. వేదపురాణాల లోని అరుణాచలుడు

అరుణాచలమని స్మరించినంతనే ముక్తిని ప్రసాదించుటకు, తన చుట్టూ మూడు యోజనాల (48 కి.మీ) విస్తీర్ణమందు నివసించు స్థావర జంగమాలను ఉద్ధరించుటకు కరుణా సముద్రుడైన పరమేశ్వరుడు తేజో లింగముగ అరుణాచలమను పవిత్రనామముతో ఈ భూమిలో తిరువణ్ణామలైలో అవతరించాడు. ఆయన మహిమను గూర్చి వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, తమిళశైవగ్రంథాలైన తిరుమురైలు ఎంతో మనోహరంగా స్తుతించాయి, కీర్తించాయి. <u>**వేదాలలో:**</u> వేదాలు అగ్నికి సముచిత స్థానాన్ని కల్పించాయి. ఋగ్వేదములోను, సామవేదములోను మొట్టమొదట ప్రయోగించిన పదము అగ్ని. యజుర్వేదములో నాలుగో భాగమంతా అగ్నిని గూర్చి వివరించబడింది. ఋగ్వేద సంహితలో ఋషిమధుశ్చందస్, "అగ్ని సర్వభక్షకుడు, ప్రకాశవంతమైన ఆత్మ, మనసులో వెలిగే సత్యజ్ఞానము" అని పేర్కొన్నాడు.

ఈ విధంగా వేదాలు అగ్నిని ఎందుకు స్తుతించాయి? అగ్నిని పూజించుటలో వేదాలు గొప్ప ప్రాధాన్యతను ఎందుకిచ్చాయి? ముఖ్యకారణము ఏమనగా సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు అగ్నిస్తంభాన్ని ఎన్నుకొని అరుణాచలముగా భూలోకములో దర్శనమిచ్చుటయే అని చెప్పవచ్చును. ఈతేజస్తంభము పరిమాణము లేనిది. అది అంతటా అన్ని కాలాలలో వుండేవి. అన్ని రూపాలు తానై వెలిగేది మానవుల అవిద్య అను చీకటిని పారద్రోలుటకు సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు జ్ఞానాగ్నిగా అరుణాచల రూపంలో ప్రకాశించాడు. అందుచేతనే వేదాలు అరుణాచలుని రూపమైన అగ్నిని నుతించాయి. వేదమంత్రాలు అగ్నికి సమర్పించబడ్డాయి. వేదాలు అగ్నిని నుతించాయంటే తేజోరాశియై, అగ్నిస్వరూపంగా ప్రకాశించే అరుణాలున్ని పొగిడినట్లే కదా! ఆయన

వేదాలలో ఈ విధంగా పొగడబడెను.

"ఈ స్వర్గశిఖరము భూమికి హృదయమై, సత్యస్వరూపమై, తేజోజ్ఞానమై, మహాకవియై, బలవర్ధకమైన ఆహారమై, కీర్తివంతమై, వైభవోపేతమై ప్రకాశిస్తూ వున్నది". (ఋ.వేదVI-9-4)

"నశించే జీవరాసులలోని భ్రాంతియుతమైన మనస్సు కంటే మించిన వేగము కలిగి స్థిరంగా ప్రకాశించేది కాంతి. సర్వదేవతలు తమహృదయాలలో వెదకి తెలుసుకొనగోరు పరమాత్మ తత్త్వమే ఆకాంతి" (ఋ. వేదVI-9-5)

"పాపకార్యలతో, జననమరణ కాలచక్రములో చిక్కుకొని భవసాగరమున మునుగుచు, తేలుచు భవబాధలు పడలేక పరమాత్మ సన్నిధిని చేరుకోవాలని పరితపించే వారిని ప్రేమతో కరుణించి దరిజేర్చు ప్రేమమయ నౌకయే ఈ అగ్ని" (ఋ.వేదVI-1-9-7 )

<u>**ఉపనిషత్తులలో**</u>: ఇక ఋగ్వేద బ్రహ్మన, కేనోపనిషత్తు, భాస్కర సంహితలు లింగోధ్భవాన్ని అనగా అవధులను దాటి బ్రహ్మాండము నంతయు ఏక కాలముననే ఆవరించి మిరుమిట్లు గొలుపు తేజోవంతమైన కాంతిస్తంభమును గూర్చి వివరించెను. "ఆకాంతి గొప్పది. మిక్కిలి దేదీప్యమానమైనది. భౌతికమైన ఇంద్రియాలకు గ్రాహ్యము కానిది. మనస్సు యొక్క ఊహకు అందనిది." అని నుతింపబడెను. ఋషియైన పరాశరుడు అగ్నిని పొగడుచు "ఈ అగ్నియే స్వయంభువు అయిన అరుణాచలుని తేజోరూపము" అని వారి ఏకవంశీయకతను గూర్చి కీర్తించినాడు.

"జ్యోతిస్సంభము యొక్క అనంతమైన శోభను చూచి బ్రహ్మవిష్ణువులు నిశ్చేష్టితులయ్యారు. ఐతే వారిరువురు తేజోరాశికంటే వేరైనవారు కారు. వారు తమలోని అతి-మానుషమైన మాయలోపడుటచే తేజస్సంభము కంటే వేరైన వారమని తలంచారు. ఈ అవిద్యయే వారి తగువుకు కారణమయింది" అని ఋగ్వేద బ్రహ్మన వివరిస్తుంది.

"అరుణాచలుడు తన తేజోవంతమైన వెలుగు చేత బ్రహ్మ విష్ణువులకు

అహంకార రహితమైన అణకువను ప్రసాదించాడు. వారికే గాక ఇతర దేవతలైన అష్టదిక్పాలరకు కూడా జ్ఞానాన్ని ప్రసాదించాడు" ఈ విషయము కేనోపనిత్తులో వివరించబడినది.

"దేవతలను మరియు సర్వులను నడిపించేది, ఒక పరమాత్మ శక్తేయని తెలియజేయుటకు అరుణాచలుడు వారి యెదుట అవతరించెను" అని ఉపనిషత్తుల యొక్క మూడవ భాగము వివరిస్తుంది.

<u>పురాణాలలోని అరుణాచలుడు :</u> వేదాలు, ఉపనిషత్తులు తేజోశక్తి, ఆవిర్భావమును గూర్చి సూచించాయి. ఇక పురాణాలు నిరాకారుడైన పరమేశ్వరుడు దేవతలను, దీనజనులను మరియు సమస్తాన్ని ఉద్ధరించుటకు తేజోరూపాన్ని ధరించి అరుణాచలముగా భువిలో ఉండిపోయాడని విపులంగా వివరించాయి. ఈ వేదాలు, పురాణాలు, పవిత్ర గ్రంధాలని, అవి పరమేశ్వరుని మహిమను గూర్చి వివరిస్తాయని, అవి పరమాత్మ కృపవలన మునులచేతను, ముక్తపురుషుల చేతను వ్రాయబడ్డాయని హిందువుల నమ్మకము. పురాణాలు 18 కలవు ఇవన్నీ వేదవ్యాసమహాముని వ్రాశాడని హైందవుల విశ్వాసము.

అతి పవిత్రములైన శివక్షేత్రములు ఏవని నైమి శారణ్యంలో (ఉత్తరప్రదేశ్) నివసించే మునులు సూత మహామునిని అడిగి తెలుసుకొన్నట్లు వ్యాసమహర్షి పేర్కొన్నాడు. ఇదే ప్రశ్నను మార్కండేయుడు నందికేశ్వరున్ని అడిగి తెలుసుకొన్నట్లు సూతముని వివరించాడు.

మార్కండేయుడు భక్తిపూర్వకముగా ప్రణమిల్లి నందికేశ్వరున్ని ఈ విధంగా అడిగెను. "ఓ మహానుభావా! నందికేశ్వరా! మంత్రతంత్రాలు లేకుండా, గ్రంధపరిచయ జ్ఞానము లేకుండా, మత సంబంధమైన పరిజ్ఞానము లేకుండా ఏ స్థలములో వున్నంత మాత్రము చేతనే సత్యజ్ఞానము పొందవచ్చునో చెప్పండి. నుదుట విభూతిని ధరించినంత మాత్రాన అజ్ఞాని సైతము శాశ్వతానందము ఏస్థలములోనైతే పొందగలడో ఆ స్థలము యొక్క పేరును సూచించండి, పరమాత్మకు సంబంధించిన ఎటువంటి ఎరుకలేక భవబంధాలలో చిక్కుకొని అలమటించే సామాన్య

గృహస్థులు సైతము ఏప్రదేశమందైతే సులభంగా పరమాత్మ జ్ఞానమును పొందగలరో తెలపండి. అతి సాధారణ మానవులు, అల్ప జంతువులు, జీవులు, పరిజ్ఞానములేని పక్షులు, జ్ఞానమెరుగని జడ పదార్థములు ఎట్టి ప్రయత్నము లేకయే ఏ పుణ్యస్థలములో నైతే పరమానందాన్ని పొందగలరో చెప్పండి".

ఈ పలుకులను విని నందికేశ్వరుడు సంతసించి సమాధానముగా పవిత్ర శివక్షేత్రాలను గూర్చి వివరించి చెప్పాడు. నదీ తీరాలలో వెలసిన శివ క్షేత్రాలను, సముద్రతీరాల్లో విరాజిల్లె శివక్షేత్రాలను, హిమాలయాలలో వెలసిన అతి పవిత్ర శివప్రదేశాలను, శివపార్వతులు దేవతలను, ఋషులను, తపోధనులను కరుణించి దర్శనమిచ్చిన పవిత్రప్రదేశాలను ఆమునిశ్రేష్ఠుడు పేర్కొన్నాడు. కాశీ, చిదంబరము, తిరువాయూరు, గయ, ప్రయాగ, శ్రీశైలము, కాదంబరి, మధుర మున్నగుపుణ్యక్షేత్ర ప్రాధాన్యతలను వివరించాడు కానీ, మార్కండేయుని మనోగత అభిప్రాయానికి తగిన సమాధానము నందికేశ్వరుని నుండి రాలేదు. ఆసమాధానము కోసము మార్కండేయుడు యుక్తియుక్తంగా మరలా ఇట్లు ప్రార్థించాడు.

ఓ దయామయా! నందికేశ్వరా! నాదొక విన్నపము. దయచేసి నాప్రశ్నను దాటివేయకండి. తమరు ఇంతవరకు వివరించిన క్షేత్రాలలో ఒక్కొక్క క్షేత్రానికి ఒక్కొక్క ప్రాధాన్యత వున్నది. ఇందులో సందేహము లేదు. ఐతే, ఈ పవిత్ర క్షేత్రాలలోని మహత్తు అంతా కలసి ఏ పుణ్యక్షేత్రములో నిండియున్నదో, ఆ పవిత్ర శివక్షేత్రమేదో సెలవియ్యండి తెలిసినవారు మరియు తెలియనివారు, కదిలే ప్రాణులు, కదలనిప్రాణులు ఇత్యాది సమస్తమూన్నూ ఏ ప్రదేశములోనైతే సులభంగా ముక్తిని పొందగలవో ఆ పుణ్య స్థలము యొక్క పేరును చెప్పండి.

ఇందుకు అరుణాచలపురాణ రచయిత ఐన శైవ ఎల్లప్పనావలర్ నందికేశ్వరుని సమాధానమును మనోహరంగా వివరించాడు. వాటిని గూర్చి మనము తెలుసుకొందాము.

నందికేశ్వరుడు మార్కండేయుని మనోగత అభిప్రాయాన్ని తెలుసుకొన్నాడు. అరుణాచలుని గూర్చి తలంచాడు తలచినంత మాత్రాన పరవశుడై సమాధిస్థితికి వెళ్ళిపోయాడు. తరువాత కొంతసేపటికి కంటినిండా ఆనందబాష్పాలతో భక్తావేశముతో కంపించే కంఠస్వరముతో, "ఔను! అట్టి మహత్తుగల ఒకానొక పవిత్రపుణ్య క్షేత్రమున్నది. అదే అరుణాచలము" అని అరుణాచలమహాత్మ్యమును వివరంగా చెప్పాడు.

అరుణాచలుని మహిమను నందికేశ్వరుడు వివరిస్తుండగా ఎందరో మహామునులు విన్నారు. వారితోబాటు జ్ఞానులైన సనత్కుమార, సనక, సనందన, సనాతనులు (దక్షిణామూర్తి మౌనబోధతో జ్ఞానులైనవారు) ఋభు మహర్షి శిష్యుడు విధాఘు, భరద్వాజ, బోదాయన, వాల్మీకి మున్నగు మునీశ్వరులందరు విన్నారు ఆత్మజ్ఞానులైన ఈ మునీశ్వరులందరు పరమభక్తితో పరమోత్సాహముతో అరుణాచలుని మహిమను తెలుసుకొని ఆనందించుటకు నందికేశ్వరుని కడకు వచ్చారంటే ఇక అరుణాచలుని మహిమ ఎంత గొప్పదో మనము ఊహింప వచ్చును.

నందికేశ్వరుడు ఇలా వివరిస్తున్నాడు "అరుణాచలము పవిత్ర శివక్షేత్రము. ఇది దక్షిణ భారతదేశంలో వున్నది. ఈ అరుణాచలము ముఖ్యంగా తన చుట్టూ మూడు యోజనాలు (48 కి.మీ) తన అనంతమైన శక్తిని పరచి యున్నది. ఈ పరిధిలో నివసించు వారందరూ ఎట్టి ప్రయత్నము లేకయే ముక్తిని పొందగలరు. ఇది పరమేశ్వరుని శాసనము కైలాసము శివుని నివాసము కావచ్చు కానీ, ఈ అరుణాచలము సాక్షాత్తు శివుడు తనరూపమే ఈ అరుణాచలమని, సమస్త లోక కళ్యాణార్ధము మరియు ముక్తిని ప్రసాదించుటకు ఈ గిరి రూపాన్ని ధరించి సిద్ధంగా వున్నానని పరమశివుడే చెప్పుకొన్నాడు. ఈభూధరము భూమికి హృదయము వంటిది. మేరు కైలాసమందర ఇత్యాది పర్వతాల కంటే ఈ అరుణాచలము మిన్నయైనదని మరియు స్వయంభువయిన శివపర్వతమని మహర్షులందరూ వేనోళ్ళ కొనియాడారు ఈ పర్వతమందు సిద్ధపురుషులు, దేవతలు, విద్యాధరులు, యక్షులు, గంధర్వులు, అప్సరసలు

నివసిస్తున్నారు. సర్వజీవరాసులు ఇక్కడకు రావలసినదే. ఎందుకంటే ఈ పర్వతము సర్వప్రాణుల పుట్టుకకు మూలకేంద్రము. ఇక్కడ నివసించినంత మాత్రాన సర్వజీవరాసులు ఎట్టిప్రయత్నము లేకయే మోక్షమును పొందుదురు. అందుచేత స్వర్గములోని దేవతలు కూడా ముక్తికోసము ఇక్కడకు వస్తారు.

ఈ కొండ చరియల్లో పుట్టి పెరిగిన వృక్షాలు భగవంతునితో కలసియుండే మహాభాగ్యాన్ని కలిగియున్నాయి. ఈ వృక్షాలు దేవతయైన అపర్ణ సౌభాగ్యాన్ని కూడా ధిక్కరిస్తున్నాయి. ఈ కొండ శిఖరముపై మేఘాల నుండి వర్షింపబడి ప్రవహించే నీరు హిమాలయాల్లో ప్రవహించే గంగకన్నా గొప్పది. ఇందు నివసించే పులులు, సింహాలు, ఏనుగులు ఈ శోణాద్రిచే కాపాడబడుతూ, గౌరవింపబడుతూ వున్నాయి. ఇక్కడి వృక్షాలు తమ పత్రాలతో, పూలతో, పండ్లతో అరుణాచలున్ని పూజించే గొప్ప పుణ్యాన్ని పొందియున్నాయి. కావున ఇక్కడి వృక్షాలు కల్పతరువు కంటే గొప్పవి. అంతేగాదు పవిత్ర పుణ్యస్థలాలలో పుట్టిపెరిగిన ఇతర వృక్షాలకంటే ఇవి మహోన్నతమైనవి. శివసాయుజ్యాన్ని చేరుకోవాలని చీకటిలో నడచుకొంటూ పోయేవారికి ఇందలి మిణుగురు పురుగులు కాంతిని అందిస్తాయి. పక్షులు, విత్తనాలు, వెదురులు ఇక్కడ వుండటంచేత దేవాతాపురుషులు కూడా పొందలేని ఆనందాన్ని పొందుతున్నాయి. క్రూరులైన వేటగాండ్రు సైతము వేటకై ఈ కొండ చుట్టూ తిరుగుట వలన తమతమ క్రూరస్వభావాల్ని వదలి నాశనరహితమైన శాశ్వత స్థాయిని పొందుచున్నారు. ఇంద్రుడు, వరుణుడు, యముడు, కుబేరుడు వీళ్ళందరూ అరుణాచలుని చుట్టూ తమతమ ప్రధాన దిక్కులందుగల పర్వతాలపై వుంటూ అరుణాచలాన్ని పూజిస్తున్నారు. అరుణాచలమునకు ఎదురుగా కనిపించే ఆ కొండలు మేరువు, హిమాలయాలకంటే మిన్నగా కరుణించబడినవి. కరుణా సముద్రుడగు పరమేశ్వరుడు ఇక్కడే సృష్టిస్థితి కర్తల అహంభావమును పోగొట్టి వినయమును నేర్పియున్నాడు. గౌతముడు, దుర్వాసుడు, అగస్త్యుడు, వశిష్టుడు మున్నగు మహామునులందరూ ఇక్కడే తపమాచిరించి తమలో తాము మునిగి

శాశ్వితుడైన సదాశివున్ని కనుగొన్నారు.

ఈ అరుణాచలము అన్నింటికి మూలమగుటచేత ప్రతియొక్కరు చివరకు ఇక్కడకు రావలసినదే. పార్వతి కూడా శివునిలో ఐక్యమగుటకు ఇక్కడకు వచ్చి తపమాచరించి, ప్రదక్షిణ చేసింది. గౌరీ దేవి ఆజ్ఞానుసారం దుర్గ భక్తుల కష్టాలను తొలగించుటకు మరియు భక్తులు ఇష్టదేవతలను దర్శించుటకు తగిన శక్తినిస్తూ ఇక్కడే వుండిపోయింది రాజులు, దేవతలు, రాక్షసులు మున్నగు వారందరూ గిరిప్రదక్షిణ చేసి తమతమ పాపాలను పోగొట్టుకొన్నారు. ఈ శోణాద్రితో పోల్చదగినదంటూ లేనేలేదు. అరుణాచలమును దర్శించాలని తలచినంతనే వారి పాపకర్మలను నిర్మూలించి అరుణాచలుడు వారిని అనుగ్రహిస్తాడు. ఆయనుగ్రహముతో వారిలో అరుణాచలున్ని దర్శించాలనే ఆకాంక్ష రోజురోజుకు ఎక్కువై చివరకు వచ్చి అరుణాచలున్ని దర్శిస్తారు. ఆయన కరుణకు పాత్రులై పవిత్రులవుతారు. మానవులసు ఉద్ధరించుటకు ఈ ధరణిలో వెలసిన పరమశివుడే అరుణాచలము. లోకాలలో నిండియున్న పాపభూయిష్ఠత అంతా ఆ కొండచూపుతో తొలగిపోతుంది. ఈ పరమార్థాన్ని "అరుణ" అనే పేరు తెలుపుతుంది. ఋషులు, సిద్ధులు, గంధర్వులు తరచుగా కైలాసపర్వతాన్ని వదలి ఇక్కడకు వచ్చి ఈ కొండను పూజిస్తారు. ఈ స్థలములో చేయు పూజలు, యజ్ఞగాయాలు, జపతపాలు తొందరగా ఫలిస్తాయి. కోరిన కోర్కెలు త్వరగా నెరవేరుతాయి. ఈ శిఖరము వైపు చూచినంత మాత్రాన పాపములు నశించుటే గాక జ్ఞాననేత్రము విప్పారుతుంది. లోచూపు ఏర్పడుతుంది. అరుణా చలుని చూచినంత మాత్రాన చెడుతలంపులు, చెడుమాటలు, చెడుదేహమంతా తొలిగిపోతుంది. గిరిప్రదక్షిణ చేసినవారి పాపాలను, సాష్టాంగ దండ ప్రణామములు చేసినవారి పాపాలను, పుష్పాలను అర్పించే వారి పాపాలను, భక్తితో ప్రస్తుతించే వారి పాపాలను ఈ అరుణగిరి సమూలంగా తొలిగిస్తుంది. ఇంద్రాది దేవతలు మరియు గౌరి కూడా పాపాముల పోగొట్టుకొనుటకు అరుణాచలములో తపము చేయవలసినదే యని పరమేశ్వరుడు శాసించియున్నాడు. ఇతర పుణ్యక్షేత్రాల కంటే

ఈ అరుణాచలములో ఎట్టి తపము చేసినా సత్వరంగా ఫలితమునిచ్చును. తుమ్మునప్పుడు, లేదా సంతోషసమయాలలోను, లేదా పొరబాటున క్రింద పడబోవునపుడును కొందరు తెలివైనవారు "అరుణాచలా!" అని అనడం జరుగుతూ ఉంటుంది. అట్టివారి మనస్సును అరుణాచలుడు పవిత్రం చేయగలడు. అరుణాచలుని చూచినంతనే కళ్ళు శుద్ధమగును. ఆయనను గూర్చి మాట్లాడినంతనే నాలుక పవిత్రమగును. స్మరించినంత మాత్రాన మనస్సు శుద్ధమగును. సర్వవ్యాపకుడైన పరమాత్మయే ఈ అరుణాచలుడు.

మొదట అగ్నిలింగమైన అరుణాచలము ప్రపంచ క్షేమం కోసం చల్లబడింది. ఆ పర్వతము కృతయుగములో అగ్ని స్వరూపము, త్రేతాయుగములో మణుల స్వరూపము. ద్వాపరయుగములో బంగారు స్వరూపము. కలియుగములో శిలా స్వరూపము. ఏదిఏమైనా అరుణాచలము అగ్ని స్వరూపము, స్వతస్సిద్ధము, తేజోవంతము. దీని వైభవము చెప్పతరము కాదు. ప్రపంచములో లింగాకృతి గల కొండ అరుణాచలము మాత్రమే. ఇంకెక్కడ ఇటువంటి దివ్య లింగాకార కొండలేదు. అరుణాచలము సిద్ధులను ప్రసాదిస్తుంది. సమస్త రోగాలను నివారిస్తుంది. సర్వపాపాలను హరిస్తుంది. కోరిన వరాలను ఇస్తుంది. ఒకప్పుడు పరమశివుడే గౌతమ మహామునితో "బూలోకంలో వెలసిన అరుణాచల భౌతిక రూపం ఎవరిదోకాదు. అది స్వయంగా నా రూపమే" అని తెలిపియున్నాడు. నిజంగా ఇది పరమేశ్వరుని సత్యస్వరూపము" ఈ విధంగా పురాణాలు అరుణాచలుని మహిమను వివరించాయి.

**తిరుమరైలోని అరుణాచలుడు :**

తమిళభాషలో పండ్రెండు తిరుమరైలు కలవు. ఇవి వేదాలతో సమానమైనవి. ప్రాచీనమైనవి కూడా. వీటిని శివభక్తులైన కొందరు నాయనారులు రచించారు. వారు ఇందు అరుణాచలుని వైభవాన్ని కన్నులారా కాంచి మనోహరంగా వర్ణించి వ్రాశారు.

మహాశివభక్తుడైన జ్ఞానసంబంధరు తన రచనలైన మొదటి మూడు

తిరుమురైలలో ఈ విధంగా అంటాడు. "గత జన్మలోని పాపాలే కాకుండా ఈ జన్మలోని పాపాలు కూడా అరుణాచలుని సంబంధముతో అంతమౌతాయి. అరుణాచలునిపై నమ్మకమున్న వారు, ప్రేమకలిగిన వారు, శరణాగతి చెందినవారు, ఆయన పాటలను పాడేవారు వీరందరూ పరవశులై ఒకే విధమైన అనుభూతిని ఆనందమును పొందగలరు. అరుణాచలము సామాన్యమైన కొండకాదు. మహత్తు కలిగిన పరమాత్మస్వరూపము. సత్యజ్ఞానమును ప్రసాదించుటకు ఇలలో వెలసిన గిరిస్వరూపము. అరుణాచలుడు మొదట తనభక్తుల హృదయాలను ఆకర్షిస్తాడు. వారిని తన చుట్టూ తిరుగునట్లు చేస్తాడు. తర్వాత వారిని మెల్లగా సత్యజ్ఞానము వైపు మళ్ళిస్తాడు. ఆనందాన్ని ప్రసాదిస్తాడు."

అప్పరు గొప్ప అరుణాచలశివుని భక్తుడు. ఆయనకు తలంపులన్నీ వీడాయి. ఐతే "అరుణాచలం" అనే స్మరణమాత్రము వీడలేదు. ఈయన తన కవితయైన "లింగపురాణ తొగై" లో ఈ విధంగా ఎలుగెత్తి చాటాడు. "బ్రహ్మవిష్ణువులు తేజోస్తంభము యొక్క ఆద్యంతములను కనుగొనలేక పోయారు. ఎందుకు? వారు పరమేశ్వరున్ని పూలతో పూజింపలేదు. పరిమళ తీర్థముతో అభిషేకించలేదు. ధూపదీపాలతో అర్చించలేదు. ఆయనను నుతించలేదు. వారు "అహం" తో వెదకుచూ వెళ్ళటంచేత అపజయాన్ని పొందారు. వారు శరణంటేనే శివుడు కరుణించాడు. నిజంగా అరుణాచలుడు భక్తసులభుడు. అందుకే భక్తులు సులభంగా ప్రేమతత్వమైన భక్తితో ఆయనను చేరుకోగలరు. అరుణాచలున్ని మనసారా ప్రేమిస్తే వారి ప్రేమకు ఆయన దాసుడౌతాడు."

శివుడే తన గురువని కీర్తించిన మాణిక్యవాచాగర్ రచన తిరువాచకము. ఇది గొప్ప పవిత్ర శివ గ్రంథము. దీనిని పాడుతున్నప్పుడు భగవాన్ రమణ మహర్షులు పరవశులయ్యేవారు. ఆయన నేత్రాలు ఆనందబాష్పాలతో నిండిపోయేవి. మాణిక్యవాచాగర్ తన రచనలో, "ప్రాపంచిక విషయాలలో తన భక్తులను ముంచి అరుణాచలున్ని మరచునట్లుచేసే అవిద్యను పారద్రోలుటకు భక్తులను

వెదకుచూ అరుణాచలుడు వస్తాడు. ప్రేమయనె వానజల్లు కురిపిస్తాడు తరింపజేస్తాడు." అని నుతించాడు.

తిరుమూలర్ శివభక్తుడు. ఈయన తిరుమందిరమ్‌ను రచించాడు. ఇందు బ్రహ్మవిష్ణువులు పరమశివుని పాదమస్తకాలను కనుగొనుటకు ప్రయత్నించిన రీతిని అద్వైతపరంగా వివరించి వ్రాశాడు. ఈయన పరమేశ్వరుని తేజస్తంభమును గూర్చి ధ్యానించి ఆరూపాన్ని లోన దర్శించి అనుభవ పూర్వకంగా అరుణాచలుని వైభవాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించాడు. ఆతేజస్స్తంభము ఎత్తు పెరుగుటకు ముందు సృష్టినంతా ఆలింగనము చేసుకొన్నదని వివరించాడు. ఇది గొప్ప అద్వైత తత్వము.

మురగ భక్తుడైన నక్కీరరు తన రచనయైన పదకొండవ తిరుమురైలో అరుణాచలుని తేజోరూపాలను ప్రస్తుతించాడు. అరుణాచలుడు ప్రణస్వరూపుడని, అందుండి ప్రణవనాదము వినిపిస్తూ వుంటుందని, బ్రహ్మవిష్ణువులు హంసవరాహరూపములు ధరించుటచే ఆ ఓంకార నాదమును వినలేక పోయారని వివరించాడు.

ఈ విధంగా అరుణాచలుని మహత్తును శివభక్తులు తమ కవితల్లో నుతించారు. అరుణాచలుని మహిమ చాలా గొప్పది అదివర్ణింప సాధ్యము కాదు.

## 4.అరుణాచలుని ప్రియభక్తులు మరియు సాధువులు

ప్రాచీన కాలము నాటి చాలామంది ఋషులు కైలాసమేరు పర్వతాల నుండి తీర్థయాత్రల కోసమో లేక అక్కడే వుండటం కోసమో అరుణాచలానికి వచ్చిరి. ఈఋషులలో పులస్త్య, వశిష్ఠ, మరీచి, అగస్త్య, దధీచి, నాగన, భృగు, అత్రి, జాబాల, జైమిని, జమదగ్ని, భరత, పిప్పల, కాశ్యప, కుముద, వర్ష, విభాండగ, వ్యాస, మాండవ్య, మతంగ, కుక్షి, మాండకర్ణి, చాండిల్య, మధు శ్చందస్, గార్గేయ, ఆపస్తంభవ, రోమశ, భార్గవ, భరద్వాజ, శ్వేతకేతు, కౌండిన్య, పుండరీక, వాల్మీకి, నారద, వహ్ని, బోధాయన, మృకంద, దుర్వాస, కాంక్వార్య, దేవదత్త,

సుస్మృత, మిత్రావసు, సుమంత, మౌద్గల్య, ఋష్యశృంగ, ఏకపాద, క్రౌంచ, గోముఖ, అంగీరస, పతంజలి, సనత్కుమార, సనక, సనందన, సనాతన, మైత్రేయ, పుష్పజిత, నిదాఘ, పరాశర, వైశంపాయన, యాజ్ఞవల్క్య, అశ్వలాయన, అనంతకరుణ, అమలక ప్రియ. కపిల మున్నగువారు ముఖ్యులు, వీరిలో వాల్మీకి మున్నగు మహామునులు మనకు ఇతిహాసములను అందించారు. వ్యాసనారదాది మనులు మనకు పురాణాలను ఇచ్చారు. ఆపస్తంభవ, బోధాయన, యాజ్ఞవల్క్య, పరాశర, జైమిని మున్నగు మునులు మనకు వేదభాగాలను ప్రసాదించారు. పిప్పల మున్నగు మునులు మనకు ఉపనిషత్తులను అందించారు. ఇటువంటి మహామునులందరూ అరుణాచలుని దివ్యశక్తి చేత ఆకర్షితులయ్యారు. అరుణాచలానికి వచ్చి ఆయనను పూజించారు.

వీరేగాక చాలామంది భక్తులు, సాధువులు అరుణాచలానికి వచ్చారు. అరుణాచలుని పూజించారు. ధన్యజీవులయ్యరు. వీరిని గూర్చి తెలుసుకొందాము.

**దైవసింగముని దేశిక పరమాచార్యగళ్ :**

700 సంవత్సరాల క్రితము ఈయన అరుణాచలమునకు తూర్పున వున్న ఒక కుటీరములో నివసించేవారు. ఈయన అరుణాచలుని భక్తుడు. తన యిష్టదైవంగా అరుణాచలుని ఆరాధించాడు. శైవమతాన్ని వ్యాప్తి చేశాడు. ఈయన గొప్పదనాన్ని తెలుసుకొని ఆదేశమును పాలించే రాజు ఒకమారు దర్శనానికి వచ్చాడు. ఇంతలో రాజు గుర్రము పాముచే కాటువేయబడి చనిపోయింది. రాజు నిర్ఘాతపోయాడు. ఐతే, మంత్రిగారు రాజును ఓదార్చి స్వామికడకు తోడ్కొని వచ్చాడు. జరిగినదంతా స్వామికి విన్నవించారు. స్వామి బయటకు వచ్చి అరుణాచలున్ని ప్రార్థించి తన చేతికర్రతో గుర్రాన్ని తట్టాడు వెంటనే గుర్రానికి ప్రాణంవచ్చింది. రాజు ఆశ్చర్యపడి స్వామి పాదాలపై పడ్డాడు. సాధువు రాజుతో అరుణాచలేశ్వర దేవాలయాన్ని ఉద్ధరించే బాధ్యతను వహింపుమని చెప్పాడు. ఈ సంఘటనను రాజు గారు దేవాలయమునకు

దక్షిణ దిశలో వున్న మూడవ ప్రాకారపు గోడల మీద చెక్కించి వున్నాడు ఈ సాధువు యొక్క సమాధి ఇప్పటికీనీ గురు మూర్తములో వున్నది. ఇది జీవసమాధి. ఇక్కడే భగవాన్ రమణులు దాదాపు ఆరుమాసాలున్నారు.

**సాధువు మంగైయార్‌క రాశి:** ఈమె సుప్రసిద్ధ సాధుమూర్తి అరుణాచలునిపై అమిత ప్రేమను, భక్తిని కలిగియుండేది. అరుణాచలుని భక్తుల యెడ కూడా ఆమె అమిత ఆదరణ చూపింది. ఒకమారు తిరువణ్ణామలైలోని జనులు నీటి యెద్దడిచే బాధపడగా అప్పటికప్పుడు పెద్దచెరువును త్రవ్వించింది. దేవాలయములో మూడవ ప్రాకారమందు ఒక మంటపాన్ని కట్టించింది. కార్తీకదీపోత్సవము నాడు అరుణాచలేశ్వరుడు గర్భగుడి నుండి ఈ మంటపానికి వచ్చి కొండశిఖరం మీద వెలిగించే జ్యోతిని తిలకిస్తాడు. ఇది దీపదర్శన మంటపంగా ప్రసిద్ధిగాంచింది. ఈమె అరుణాచలేశ్వరునకు అనేక ఆభరణములను అర్పించింది. ఈమె తన సర్వస్వాన్ని అరుణాచలేశ్వరునకు అర్పించి ఆయన కరుణను పొంది తరించింది. ఈమె ఔదార్యపు పనులను పొగడుచూ దేవాలయ ప్రాకారముల మీద వ్రాయడియున్నది.

**పానిపత్రస్వామి :** ఈయన 13వ శతాబ్దానికి చెందిన సాధువు అరుణాచలునిచే ఆకర్షితుడయ్యాడు. ఈయన అరుణాచలునితేజోరూపాన్ని గూర్చి వ్యాప్తి చేశాడు. ఒక మారు ఈయన దేవాలయానికి నీరు తీసుకపోవాలనుకొన్నాడు. అంతే! బ్రహ్మ తీర్థమునుండి నీరుగల పాత్ర ఈయన చేతుల్లో వుండి పోయింది. ఈ కారణము చేతనే ఈయన పాని (నీరు) పత్ర (పాత్ర) స్వామిగా ప్రసిద్ధిగాంచాడు. అరుణాచలేశ్వరుడు ప్రతిదినము ఈయనకొక బంగారు నాణెమిచ్చి తన భక్తులకు భోజనము పెట్టమని చెప్పువాడని చాలామంది చెబుతారు. అందుచే ఈయన శివభక్తులకు భోజనవసతి కల్పించాడు. ఈయన అరుణాచలుని మహిమను అందరకూ చెప్పేవారు. ఆవిధంగానే విన్నవారిని ఇతరులకు చెప్పండని కోరేవారు. ఈయన ధన్యుడైన సాధువు.

**దక్షిణామూర్తి స్వామి :** ఈయన అరుణాచలుని కృపవలన జన్మించాడు.

అందుకే అరుణాచల మని పిలువబడ్డాడు. ఈయన ఐదేండ్ల వయస్సు వరకూ మట్లాడలేదు. ఒక సాధువు వచ్చి చూచి తల్లిదండ్రులతో, "ఆబాలునితో మాట్లాడండి. అతడిప్పుడు మాట్లాడును" అన్నాడు. వారు అట్లే చేయుగా బాలుడు మాట్లాడెను. ఇన్నాళ్ళెందుకు మాట్లాడకుండా ఉండి పోయావని తల్లితండ్రులు అడుగగా వారికి తన ప్రగాఢమైన ఆధ్యాత్మిక అనుభవాన్ని ఇలా తెలియజేశాడు. "నేను ఆనందంగా వుంటిని నాకు మానసికమైన చర్యలేదు" అని. ఆపలుకులు అక్కడున్న సాధువు విని "నీవెవరు?" అని ప్రశ్నించాడు. "నేనే నీవు నీవే నేను" అని సమాధానమిచ్చాడు. ఏకత్వమును తెలుసుకున్న మహానుభావుడని సాధువు తలంచి ఆ బాలుని మహోన్నత ఆధ్యాత్మిక స్థితిని గూర్చి పొగడెను.

ఈయనకు తల్లిదండ్రులు అరుణాచలుడని పేరు పెట్టారు. ఎందుకు? అరుణాచలుని కృపవలన జన్మించినందువలన. ఐతే వారు వైష్ణవులు కావున శైవసంబంధమైన పేరు పెట్టడం బంధువులకు ఇష్టములేదు. కానీ వారు మొదట చెప్పలేకపోయారు. కొంతకాలము గడచిన తరువాత బంధువులు అరుణాచల మనే పేరుకు బదులుగా వెంకటాచలమని పిలుస్తే బాగుంటుందని సూచించారు. ఈవిషయాన్ని తల్లిదండ్రులు అరుణాచల స్వామికి తెలియజేశారు. అప్పుడు వారికి ఆయన ఈవిధంగా తెలియజేశాడు. "అరుణాచలమంటే వెంకటాచలమే. ఈరెండింటికి భేదము లేదు. "అరుణాచలము" లోని మొదటి అక్షరము హరిని తెలియజేస్తుంది. రెండవ అక్షరము లక్ష్మీని ఎరుక పరుస్తుంది. మూడవ అక్షరము నారాయణుని తెలియజేస్తుంది. ఇక అచలమనే పదము తిరుమలను తెలియజేస్తుంది. కావున అరుణాచలమునకు వేంకటాచలమునకు భేదము లేదు" ఇట్లు ఆయన వారిరువురి అభేదతత్వాన్ని తెలియజేశాడు.

అరుణాచల స్వామి దక్షిణామూర్తి స్వామిగా ప్రసిద్ధిగాంచాడు. అనేక మహిమలను చూపించాడు. అనేక చోట్ల కనిపించాడు అందుచే ఒకాయన, "మీరు అంతటా ఎట్లుండగలుగు చున్నారు?" అని ప్రశ్నించెను. "నేను నీవు, అతడు ఆమె, అది ఇది అను భేదము వదిలిన

వానికి అది సాధ్యమౌతుంది. అట్టివాడే అనంతమైన పరమాత్మ" అని సమాధానమిచ్చాడు.

ఇంకొక సందర్భములో ఆయన ఒక కోనేరు మెట్లపై పరుండి యున్నాడు. సూర్యుని వేడిమి బ్రహ్మాండంగా వుంది. దానిని ఆయన లెక్కించలేదు. తనలో తానుండి పోయాడు. ఇదొక మిత్రుడు చూచి "ఎండలో తపించనేల? చెట్టునీడలో సేద తీర్చుకోవచ్చు కదా!" అన్నాడు. "విశ్వవ్యాపకమైన ఆత్మకు ఎండేది! నీడేది! అంతా తానాయె అనంతమైన పరమాత్మకు ఒక చెట్టు నీడనిస్తుందనటం ఎండమావుల వలన చల్లదనాన్ని పొందినట్లుగా వుంటుంది" అని స్వామి సమాధానమిచ్చాడు. ఈయన అరుణాచలుని భక్తుడు.

**ఈశాన్య జ్ఞానదేశికర్** : ఈయన వేలూరులోని వెల్లాల తెగకు చెందినవాడు. చిన్ననాడే సూక్ష్మబుద్ధిని, మహోన్నత ఆశయాలను కలిగి వుండేవాడు. పవిత్రశివక్షేత్రాలను దర్శిస్తూ చివరకు తిరువణ్ణామలైకి వచ్చాడు. అందలి ఈశాన్య లింగ సమీపములో కూర్చొని అరుణాచలున్ని ధ్యానించాడు. జ్ఞానాన్ని పొందాడు. అందుచే ఈశాన్యజ్ఞానదేశికర్‌గా ప్రసిద్ధిగాంచాడు. ఈయన మొదటి పేరు కడప్ప దేశికర్. ఎవరైన భక్తులు తనకు కానుకలిస్తే వాటిని అరుణాచలేశ్వరునకు సమర్పించేవాడు. ఈయన వద్ద రెండు పెద్దపులులు వచ్చి ఎప్పుడూ కూర్చొని వుండేవి. భక్తులు తనను చూడటానికి వస్తే వాటిని సమీపమందలి అడవిలోకి పొమ్మని చెప్పేవారు. ఆయన జీవసమాధి ఇప్పటికినీ అక్కడున్నది. దానిపై దేవాలయము నిర్మింపబడినది. నిత్యము వేదోక్తంగా పూజలు జరుగును.

**అమ్మని అమ్మైయార్** : ఈమె అరుణాచలుని పిలుపు మేరకు తిరువణ్ణామలైకి వచ్చి ఒక మఠములో వుండి పోయింది. అరుణాచలుని కృపచేత గొప్ప మహిమను సంపాదించింది. ఈమె అరుణాచలుని స్మరిస్తూ విభూదితో పెద్దపెద్ద రోగాలను నయము చేసేది. ఈమె అరుణాచలేశ్వర దేవాలయములో ఉత్తర దిశలో వున్న పెద్దగోపురాన్ని

పునరుద్ధరించింది. అందుకే ఆ గోపురాన్ని అమ్మని అమ్మన్ గోపురమని పిలుస్తారు. చిన్నవయస్సునందే ఈమె ఇటువంటి కార్యాలను సాధించింది. ఇందుకు అరుణాచలుని కృపయే కారణమని చెప్పవచ్చు. ఆయన దయచేతనే ఆమె అంతటి మహిమాన్వితు రాలయింది. ఈమె సమాధి ఈశాన్యలింగ సమీపములో వున్నది. అక్కడ గుడి వెలసింది.

**ఇరైస్వామిగళ్ :** ఈయన ఒక వింతైన పద్ధతిలో అరుణాచలున్ని ఆరాధించాడు. ఈకొండ చుట్టూ ప్రతి అడుగునకు 1008 లింగాలు భూమిలో వున్నట్లు ఒక ప్రతీతి కలదు అందుచే ఈయన ప్రతి అడునకు 100 మారులు అరుణాచల నామాన్ని స్మరిస్తూ కొన్ని గంటలు అడుగు తరువాత అడుగు వేసుకుంటూ వెళ్ళేవాడు. తరువాత సాధారణముగా నడచివెళ్ళి ఒకరోజు గిరిప్రదక్షిణను ముగించేవాడు. మరుసటి దినమున మరలా 1008 సార్లు అరుణాచల నామ జపంచేస్తూ నిన్నటి దినమున చేసిన పాద ప్రదక్షిణ వరకు నడచి వెళ్ళి అక్కడ నుండి మరలా ప్రతి అడుగునకు 100 సార్లు అరుణా చలనామాన్ని స్మరిస్తూ కొన్ని గంటలు నడచి తరువాత యధాప్రకారము ప్రదక్షిణ ముగించేవాడు. ఈవిధంగా ఈయన నిత్యము ప్రదక్షిణ చేసి తన భక్తిని అరుణాచలునకు తెలుపుకొన్నాడు.

ఈయన తానొక అడవి మనిషినని చెప్పుకొన్నాడు. "ఈ అడవి మనిషి ఆహారం కోసము వెదకుచున్నాడు. ఈమనిషికి కావలసిన ఆహారం (ఇరై) లభించింది" అని చెప్పుకొనేవాడు. అందుచే ఆయనకు ఇరైస్వామి అనే పేరు వచ్చింది. ఎవరైనా అనవసరంగా మాట్లాడుతూ కాలాన్ని వ్యర్థము చేస్తుంటే చూస్తూ ఊరకుండేవారు కాదు. వారిని మందళించేవారు. "వ్యర్థమైన మాటలతో కాలము గడిపేందుకు బదులు అరుణాచలనామాన్ని స్మరిస్తే పరమ పదము లభిస్తుంది" అని చెప్పేవారు. అరుణాచలుని యెడ ఈయనకు గల భక్తి అపారమైనది.

**గుహైనమశ్శివాయర్ :** ఈయన 15వ శతాబ్దానికి చెందిన సాధువు. కర్ణాటక ప్రాంతము నుండి అరుణాచలమునకు వచ్చాడు. గురుభక్తి పరాయణుడగుటచే మొదట అరుణాచలునకు తలవంచి నమ్మకమున్నా

నమస్కరించలేదు. అంతేగాదు అరుణాచలేశ్వర దేవాలయములోనికి కూడా పోలేదు. కానీ అరుణాచలుడు ఆయనను పూర్తిగా మార్చి తన భక్తునిగా చేసుకొన్నాడు. గుహైనమశ్శివాయ అరుణాచలున్ని ఆరాధించి గొప్ప మహిమ కలవాడయ్యాడు. ఒకప్పుడు ఈయన చనిపోయిన గొర్రెను బ్రతికించాడు. కొందరు మూర్ఖులు దీనిని నమ్మలేదు. వారు పరీక్షింపదలచి ఆరోగ్య వంతుడైన మనిషిని చచ్చినట్లు పాడెకు కట్టి ఆయన వద్దకు తెచ్చారు. బ్రతికింపుడని ఆయనను కోరారు. ఐతే నమశ్శివాయ వారి మోసమును తెలుసుకొన్నాడు. విసుగుచెందాడు. "మరణించాడు పో" అన్నాడు. అంతే అతడు నిజంగా చనిపోయాడు గుహైనమశ్శివాయ బాధపడుచు నాటి పరిస్థితిని తమిళవెన్బాలో," ఈ తిరువణ్ణామలై క్రూరులకు నిలయమయింది. ఇక్కడ వారి ఆగడాలు అధికమయ్యాయి. వారిని ప్రశ్నించేవారు లేరు. అడ్డుకొనేవారంతకూ లేరు. ఈ తిరువణ్ణామలై నా శాపముతో నాశనమైపోవుగాక" అని వెన్బాను ముగిస్తుండగా అరుణాచలుడు వచ్చి ఆయన మెడపట్టుకొని, "నేను సాక్షాత్తు ఇక్కడుండగా నీవట్లు చెప్పుట ఎట్లు సాధ్యమగును?" అని మందలించాడు. వెంటనే గుహైనమశ్శివాయ "ఐతే, ఎవరి చేతను నాశనము కానట్టి పవిత్ర స్థలము ఈ తిరువణ్ణామలై" అని చివరి చరణాన్ని మార్చాడు.

గుహై నమశ్శివాయ తన పాంచభౌతికమైన శారీరక జీవితము ముగుస్తుందని ముందుగానే తెలుసుకొని, "ఈశరీరమే నేనుగా భావించకండి నేను ఈ శరీరాన్ని కాదు" అని చెబుతూ సమాధిలోకి వెళ్ళిపోయారు. గుహైనమశ్శివాయ రచనలు ఆయనకు అరుణాలునిపై గల అపారమైన భక్తిని చాటుచున్నవి. ఆయన సలహా ఏమంటే, "ఈ శరీరము వయస్సుతో మార్పు చెందక మునుపే, ఇంద్రియాలు తమ శక్తిని కోల్పోవక ముందే, యముడు వచ్చి ప్రాణాన్ని తీసుకొనిపోవకముందే ఓ మనసా! శోణగిరి ముందుకు నడచిపో. ఆయనను చేరుకో. అరుణాచలుని అనుగ్రహము పొందుట అంత సులభముకాదు. ఎందుకంటే దేవతలైన బ్రహ్మవిష్ణువులు సైతము ఆయన నిజస్వరూపాన్ని

చూడటానికి చాలా కష్టపడ్డారు. అందుచే మనము తీవ్రమైన వాంఛ లేనిదే చూడగలమా?" అని తన కవితలో ప్రబోధించారు. "అరుణాచలుని శరణందుటయే మన జీవిత పరమార్ధము" అని ఆయన తెలిపియున్నాడు.

ఈయనకు ఇద్దరు సుప్రసిద్ధ శిష్యులుండేవారు. ఒకరు విరూపాక్షతేవారు. మరొకరు గురునమశ్శివాయ. విరూపాక్షతేవారు గుహైనమశ్శివాయ గుహకు కొంచెము పైన నివసించేవాడు ఈయన యోగాగ్నిచే శరీరాన్ని దహించుకొన్నాడు. ఆబూడిద అక్కడుండేది. దాదాపు నాలుగు శతాబ్దాల తరువాత భగవాన్ రమణ మహర్షులు ఆభస్మమును లింగరూపంగా తానే తయారు చేసి చక్కని నిర్మాణాన్ని ఏర్పాటు చేసియున్నారు. విరూపాక్ష గుహ యందే భగవాన్‌రమణమహర్షులు చాలా కాలము నివసించియున్నారు. ఇప్పుడు గుహను శ్రీరమణాశ్రమము వారు చక్కగా పోషిస్తున్నారు.

**గురునమశ్శివాయ:** ఈయన గుహైనమశ్శివాయ ప్రియశిష్యుడు ఈయన తన గురువు వలె అణ్ణామలై వెన్బాను వ్రాశాడు. అందు అరుణాచలుని మహిమను ఆయన తనను అనుగ్రహించిన విధమును ఆయన భక్తులను ప్రేమించిన విధమును చక్కగా వివరించాడు. గురునమశ్శివాయ అంటారు. "అరుణాచలుడు కరుణామయుడు. ఆయన తన పాదపద్మాలను ఆశ్రయిచిన వారి ఆగామి సంచిత ప్రారబ్ధకర్మలను నాశనము చేసి జనన మరణములనే కాలచక్రమునుండి రక్షిస్తాడు అరుణాచలుడు తన బిడ్డల అజ్ఞానాంధకారమును తొలగించి తన తేజోరూపాన్ని వారికి ప్రసాదిస్తాడు ఈ కొండ ముక్తిని ప్రసాదించుటకు భూలోకములో వెలసిన పరమేశ్వరుని స్వరూపము. అరుణాచలుడు తన భక్తుల హృదయాలలో వుంటూ వారితో ఆడుకొంటాడు. ఇతర శివక్షేత్రాల కంటే ఈ అరుణాచల క్షేత్రము గొప్ప మహిమ కలది జననమరణాలనే భవరోగానికి మందును ఈగిరి అందిస్తుంది. అరుణాచలుడు తనను నమ్మిన భక్తుల హృదయాంతరల్లో దూరి వుండగలడు భక్తి పూరితమైన మనస్సుతో పూజించేవారిని అరుణాచలుడు

కరుణిస్తాడు. కన్నతల్లి కంటే మిన్నగా తన బిడ్డలపై ప్రేమను కురిపించే కరుణాంతరంగుడు అరుణాచలుడు" ఈ విధంగా గురు నమశ్శివాయ తన రచనలలో అరుణాచలుని ప్రేమతత్వము వివరించాడు.

ఈయనకు అరుణాచలుడు మాత్రమే దేవుడు. ఈయన ఇంకా ఈ విధంగా అంటాడు, "ఇతర దేవతలపై కవితలు వ్రాసిన కవులందరూ మరలా జన్మించినట్లు మనము వింటున్నాము. ఐతే అరుణాచలుని గూర్చి వ్రాసినవారు, పాడినవారు జననమనరణాలనే కాలచక్రములో చిక్కుకొన్నట్లు వినియుండలేదు". అంతేగాక ఆయన మనలను ఈ విధంగా ప్రశ్నిస్తాడు. "ఇతర దేవతలను పూజించడం దేనికి? ఇక్కడ ముక్తినిచ్చుటకు శాశ్వితుడైన, ప్రేమస్వరూపుడైన అరుణాచలుడు సిద్ధంగా వున్నాడు కదా!" అని. అరుణాచలము కేవలము కొండయిని భావించే వారికి ఇందు మూలంగా గురునమశ్శివాయ కనువిప్పు కలిగించాడు. గురునమశ్శివాయ అరుణాచలుని అనుగ్రహమునకు పాత్రుడైన పుణ్యజీవి.

**వీరవైరాగ్యమూర్తి స్వామి:** ఈయన తిరువణ్ణామలైకి సమీపమందలి శీనాండల్ అనే పల్లెటూరులో మఠాన్ని స్థాపించి వుండేవారు. అక్కడే నింరంతరం అరుణాచలుని ధ్యానములో మునిగియుండెవాడు. అరుణాచలుని కృపకు పాత్రుడై ఎన్నోసిద్ధులను పొందాడు.

ఒకమారు తిరువణ్ణామలైలో జరిగే కార్తీకదీపోత్సవమునాడు ముస్లిం రాజు గోవును వధించాడు. స్వామి దీనిని చూచి సహించ లేకపోయాడు. తన తపోమహిమచే దానికి ప్రాణము పోసి బ్రతి కించాడు. దీనికి చిహ్నంగా ఆయన పచ్చికను మేసే ఱాతినందిని అక్కడ ఏర్పాటు చేయించి యున్నాడు. ముస్లింరాజు ఈ అద్భుతమును వేనోళ్ళపొగడెను. అంతేగాక అరుణాచలుని మహిమను అనేక విధాలుగా ప్రస్తుతించెను.

తనకు గల అద్భుత శక్తులను చూపుటకు మండే ఎర్రని ఇనుప పాద రక్షలను ధరించి తిరువణ్ణామలైకి వచ్చేవాడు. ఇలా ధరించడం దృఢమైన వైరాగ్యానికి గుర్తు అందుకే ఈయనను వీరవైరాగ్యమూర్తి స్వామి అని పిలిచేవారు. ఈయన అరుణాచలుని అనుగ్రహముచేత కోసము

గొప్పసిద్ధులను పొంది తరించాడు.

**పలని స్వామి :** ఈయన ప్రాపంచిక విషయ సుఖాలపై విరక్తి చెంది అరుణాచలానికి వచ్చాడు. అరుణాచలేశ్వరునకు ఊడిగము చేశాడు. దేవాలయాన్ని శుభ్రంగా వుంచడం, పూదోటలను పెంచడం, ఇత్యాది పనుల ద్వారా అరుణాచలుని సేవించాడు. ఆయన టౌనులోని ధనికుల నుండి డబ్బు సేకరించి అరుణాచల భక్తులకు అన్నవస్త్రాదులు సమకూర్చేవాడు. ఈయనే భగవాన్ రమణులకు అరుణాచలములో మొదటి భిక్షను అందించిన పుణ్యాత్ముడు.

**అరుణగిరి నాథర్ :** ఈయన మురగన్ భక్తుడు బాల్యమందే తల్లిదండ్రులు గతించారు. అందుచే తిరువణ్ణామలైలో నివసించే సోదరి వద్దకు వచ్చాడు. అక్కడ ఆయన భోగలాలసుడై జీవించారు. సోదరీ అతని ప్రవర్తనను తెలుసుకొని నిందించింది. అందుకు అరుణగిరినాథ్ మిక్కిలి బాధపడి అరుణాచలేశ్వర దేవాలయ మండలి వల్లాల మహారాజ గోపురమునెక్కి ఆత్మహత్య చేసికొనుటకు యత్నించాడు. ఇంతలో ప్రభువైన మురగన్ వచ్చి అతని ప్రయత్నమును అడ్డగించి జ్ఞానాన్ని ప్రసాదించాడు. నాటి నుండి పరమాత్మ తత్వమును ధ్యానించి మహోన్నతుడయ్యాడు. దక్షిణాది యందుగల సుబ్రహ్మణ్యస్వామి దేవాలయాలన్నింటినీ దర్శించాడు సిలోనుకు వెళ్ళి అచ్చటగల వైష్ణవ విల్లిపుత్తూరు ఆళ్వారును వేదాంత చర్చలో ఓడించాడు నాటి పాలకుడైన ప్రభుద దేవరాయలను మెప్పించి జైన మతము నుండి శైవమతములోనికి మార్చాడు. ఇది సంబందన్ నకు నచ్చలేదు. అందుచేత అరుణగిరినాధన్‌ను కష్టాలుపాలు చేయాలనుకున్నాడు. రాజుని పురికొల్పి అరుణగిరినాథ్‌ను పారిజాత పుష్పాన్ని తెమ్మని ఆజ్ఞాపింపజేశాడు. అరుణగిరినాథర్ తన శరీరాన్ని వదలి చిలుక రూపమును ధరించి పారిజాత పుష్పమును తెచ్చుటకు స్వర్గానికి ఎగిరిపోయాడు. ఆయన వెనుతిరిగి వచ్చు సమయాన అరుణగిరినాథన్ శరీరాన్ని రాజాజ్ఞచే సంబందన్ కాల్చివేశాడు. కానీ అరుణగిరినాథ్ పారిజాత పరిమాళాన్ని వాసన చూచి చిలుకగానే వుండిపోతాడు. రాజు తాను చేసిన తప్పునకు వగచి క్షమింపుమని చేరే

ఆయనను ప్రార్థింపగా "ఇది నాప్రారబ్ధవశంగా జరిగింది. నీవు దుఃఖింపకు" అని చెప్పాడు. ఆయన చిలుకగానే వూంటూ మురగన్ మీద మరియు అరుణాచలుని మీద ఎన్నో పాటలను వ్రాశాడు.

**శ్రీ శేషాద్రి స్వామిగళ్ :** ఈయన 1870న కాంచీపురమందు మార్గతమ్మాళ్ మరియు వరదరాజన్ అనే పుణ్య దంపతులకు పుట్టాడు. తల్లిదండ్రులు పెట్టిన పేరు శేషాద్రి. ఈయన బాల్యమందే తల్లి మరణిస్తూ అరుణాచలున్ని స్మరించింది. "అరుణాచలా! అంటే చాలు ముక్తిని ప్రసాదిస్తాడు" అని పలికి మరణించింది. ఈ పలుకులు శేషాద్రిని ప్రగాఢంగా ఆకర్షించాయి. శేషాద్రి అరుణాచలము రావడానికి ఇదే ప్రబలకారణము.

శేషాద్రి బాల్యమందే శక్తివంతమైన ఆధ్యాత్మిక సాధనలను ప్రారంభించాడు. నిరంతరము మంత్రాన్ని జపించాడు. ఇంట్లోవున్నా వీధిలోవున్నా, శ్మశానంలోవున్నా ఎక్కడున్నా సరే నామజపాన్ని ఎడతెరపి లేకుండా అహర్నిశలు చేశాడు. కొన్నాళ్ళకు ఆధ్యాత్మికంగా ఎనలేని అభివృద్ధిని సాధించాడు. ప్రగాఢ సమాధిస్థితికి చేరు వయ్యాడు. ఇదంతా బంధువులు చూచి ఆయనను ప్రాపంచిక జీవితంవైపు త్రిప్పటానికి ప్రయత్నించారు. కాని ఆయన వారి మాటలను వినలేదు. తన మార్గాన్ని తాను అనుసరించాడు. ఒకమారు బంధువులు ఆయన్ను గదిలో వుంచి తాళము వేశారు. తరువాత తలుపులు తెరచి చూశారు. అక్కడవారికి శేషాద్రి కనిపించలేదు. ఇక వారు శేషాద్రి మహిమను తెసుకొని తమ ప్రయత్నాన్ని మానుకొన్నారు. శేషాద్రి తన 19వ ఏట అనగా 1889లో ఇల్లు వదలి అనేక ప్రాంతాలు పర్యటించి చివరకు అరుణాచలం వచ్చాడు. అప్పటినుండి సమాధిలో ప్రవేశించు వరకు ఆయన అరుణాచలము వదలి వెళ్ళలేదు. ఆయన 1929లో సమాధి అయ్యాడు. అవధూత లక్షణాలు కలిగి పిచ్చి వాని వలె తిరువణ్ణామలై అంతా తిరిగాడు. ఈయన ప్రాపంచిక అవధులను దాటిన అవధూత.

**భగవాన్ శ్రీ రమణ మహర్షి :** ఈయన 1879వ సంవత్సరము

డిశంబరు 30 తేదీన తమిళనాడులోని తిరుచ్చుళి అనే గ్రామములో అళగమ్మ సుందరమయ్యర్ అను పుణ్య దంపతులకు జన్మించాడు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకట్రామన్. ఈయన సద్వస్తువు తెలుసుకొని అరుణాచలానికి వచ్చేవరకు అతి సాధారణంగా పెరిగాడు, ఆటలాడాడు, చదువుకొన్నాడు. ఈవిధంగా బాల్యావస్థకు తగిన పనులన్నీ యథాతంగా చేశాడు. కానీ ఆయనొక మహాపురుషుడగునని ఎవరికీ తెలియదు. ఉన్నట్లుండి బాలుడైన వెంకట్రామన్ తన యిల్లు వదలి అరుణాచల క్షేత్రానికి వచ్చాడు. మానవాళి విధిని మార్చడానికే ఆయన అటకు వచ్చాడు. ఆ బాలుడు అరుణాచలానికి ఏవిధంగా వచ్చాడో కొంత తెలుసు కొందాము.

1895 నవంబరు నెలలో ఒక రోజున వెంకట్రామన్ ఇంటికి దూరపు బంధువు రావటం తటస్థించింది. ఆయన అరుణాచలము నుండి వస్తున్నాడు. వెంకట్రామన్ ఆయనతో కలిశాడు. అప్పుడాయన వయస్సు15 సంవత్సరాలు. "మీరు ఎక్కడ నుండి వస్తున్నారు" అని వెంకట్రామన్ బంధువును అడిగాడు. "అరుణాచలము నుండి వస్తున్నాను" అన్నాడా బంధువు. "అరుణాచలమా! అదెక్కడున్నది?" అన్నాడు వెంకట్రామన్ అదే! తిరువణ్ణామలై! నీ వెరుగవా!" అన్నాడు బంధువు.

ఈ విధంగా వెంకట్రామన్ బంధువు వలన "అరుణాచలము" అని విన్నాడు. వెంటనే అరుణాచలుని సమ్మోహనాస్త్రము వెంకట్రామన్‌పై పడింది. శాశ్వత స్వర్గము వైపు మరలించింది.. అదే పరమేశ్వరుడు వెలసిన పుణ్యదామము అరుణాచలము. ఆధ్యాత్మికంగా పరమశాంతిని ప్రసాదించే దైవాంశ సంభూతమైన స్థలము ఈ భూలోకములో ఒకటున్నది అదే "అరుణాచలము" అనే అనుభూతి బాలుడైన వెంకట్రామన్‌కు కలిగింది.

అరుణాచలుడు వెంకట్రామన్‌కు తెలియకుండగనే గురువై పోయాడు. వెంకట్రామన్‌ను అరుణాచలము వైపు నడిపించాడు. తిరువణ్ణామలై

ఏర్పాట్లన్నీ అరుణాచలుడే సమకూర్చాడు. వెంకట్రామన్ కోసము రైలు వేచియుండునట్లు చేశాడు. మౌళ్వీరూపములో వచ్చి తిరువణ్ణామలైకి పోవుటకు కావలసిన సలహాలు ఇచ్చాడు. అరయని నల్లూరులోని దేవాలయములో తన జ్యోతిస్స్తంభాన్ని చూపించాడు. చివరకు తిరువణ్ణామలైకి చేర్చాడు. అప్పుడు దేవాలయ తలుపులు తాళము వేసి వుంచబడ్డాయి. వెంకట్రామన్ రాకతో ద్వారాలు అవంతటవే ఒక్కొక్కటి తెరచుకొని ఆయనను లోనికి ఆహ్వానించాయి. ఆయన గర్భగుడిలోకి వెళ్ళాడు. "అప్పా! నీ యాజ్ఞ అయింది వచ్చాను" అని విన్నవించుకున్నాడు. అంతే అయిపోయింది. పరిపూర్ణుని చెంత చేరాడు. పరిపూర్ణత్వం అభించింది. రమణుని సర్వకార్యములు అరుణాచలుని అధీనమయ్యాయి. తనకు తాను వుండి పోయాడు. ఇది అరుణాచలుని కటాక్షము.

"అరుణాచలము" అనే పేరు విన్నప్పటి నుండి వెంకట్రామన్‌లో ఎంతో మార్పు వచ్చింది కదా! ఐతే, వెంకట్రామన్‌ను అరుణాచలుడు ఎంత ప్రభావం చేశాడో ఎవరికీ తెలియదు. అరుణాచలుడు ఆయనలో జ్ఞప్తికి రావడం చాలా రహస్యముతోకూడుకొన్నది. ఆయన ఒక్కడే అరుణాచలుని సంబంధాన్ని గుర్తించాడు. గ్రహించాడు. అది ఇతరులకు తెలియకుండా తనలోనే వుంచుకొన్నాడు. ఆయన "అరుణాచల పదిగము" 5వ పద్యములో "ఓ నాయకా! దొంగ తనముగ నన్ను తెచ్చి నీయొద్ద పదముల నిలిపితి విన్నినాళ్ళు" అని పేర్కొన్నాడు. అంతేగాక "అక్షరమణమాల"లో "ఎవరు నానోటిలో మన్నును గొట్టి నాబ్రతుకు హరించినది. అరుణాచలా! ఎవరు గనక నాదు మదిని మైకపరచి కొల్ల గొనిన దెవరు అరుణాచలా! పేరుతలగనే పట్టిలాగితివి అరుణాచలా!" అని అంటాడు. దీనిని బట్టి ఆయనకు అరుణాచలునితో ఎంత ప్రగాఢ సంబంధముండేది తెలియవస్తుంది.

ఇది మహత్తర ఆధ్యాత్మిక పరిణామము. అరుణాచలుని అంశము భగవాన్ రమణమహర్షి రూపము ధరించి సద్గురువుగా లోక కళ్యాణం కోసము మరియు ఆత్మవిచారణా మార్గమును ప్రజలకు అందించుట

ఈ భువిలో అవతరించాడు. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు ఇతిహాసాలు మున్నగు పవిత్రగ్రంథాలు, బ్రహ్మాది దేవతలు, ఆదిశంకరుడు, గౌతమ మహాముని మున్నగు జ్ఞానులు మరియు కవులు వీరందరూ అరుణాచలున్ని అనేక విధాలుగా కొనియాడారు, పాడారు. ఐతే భగవాన్ రమణులు ఒక్కరే అరుణాచలుని సత్యవైభవాన్ని తెలుసుకొని తన్మయుడైనాడు. ఆయన ఒక్కరే అరుణాచలుని అచలమార్గమగు మనోనాశనామార్గాన్ని అంటే "నేనెవడను?" అనే విచారణా మార్గాన్ని అందరకు పంచిపెట్టిన మహర్షి. అరుణాచలుని వలె మహర్షి కూడా భక్తులకు అభయ హస్తమిచ్చాడు, "అరుణాచలుని వలె మమ్ములను మీరు రక్షిస్తారా?" అని భక్తుడడుగగా, తప్పనిసరిగా, తప్పనిసరిగా, తప్పనిసరిగా" మూడు మారులని తన అభయాన్ని తెలియజేశాడు. "అరుణాచలా! అంటేనే అరుణాచలుడు తన భక్తులను తరింపజేస్తే ఇక ఈ భగవాన్‌రమణుడు" తన చెంత వున్నంత మాత్రాన ఎట్టిసాధనా సంపత్తి లేని పశుపక్ష్యాదులను తరింపజేశాడు. తల్లికి మోక్షాన్ని ప్రసాదించాడు. ఇదంతా అందరకూ తెలిసిన సంగతి. తెలియకుండా ఎంత మంది భగవాన్‌చే తరించబడ్డారో చెప్ప సాధ్యము కాదు. 'రమణ!' అంటే చాలు ఎట్టివారినైనా తరింపజేయుటకు అరుణాచలరమణుడు కంకణము కట్టుకొన్నాడు. అరుణాచలుని వలె కరుణాసముద్రుడు భగవాన్‌రమణులు.

అరుణాచలునకు మాత్రమే తన జ్యోతిరూపాన్ని భౌతికరూపాన్ని మరియు నిరాకారతత్వాన్ని తెలియజేసే మహిమ కలదు. ఇతరులకిది సాధ్యముకాదు ఐతే, భగవాన్ రమణులు కూడా అరుణాచలుని వలె మహిమలను చూపించే వారు ఒకమారొక భక్తుడు "మీ రూపాన్ని మాకు చూపండి" అని భగవాన్ను ప్రార్థించాడు. "సరే! చూడండి" అని భగవాన్ మౌనముద్రధారియై కూర్చున్నాడు. ఆ భక్తుడు భగవాన్ వైపు చూస్తున్నాడు. కొంతసేపటికి భగవాన్ భౌతికరూపము కనపడకుండా పోయింది. తేజస్సు మాత్రము గోచరించింది. తరువాత భగవాన్, "చూశావా! నారూపమెట్టిదో? నాకు రూపము లేదు" అని అన్నాడు. భగవాన్ అరుణాచలాంశ సంభవులు కాబట్టి అరుణాచలుని వలె మహిమలు

చూప సాధ్యమయింది.

చాలా మంది సాధువులు, కవులు తమ రచనల్లో అరుణాచలున్నే కాకుండా ఇతర దేవతలను, ఇతర క్షేత్రాలలోని శివులను పేర్కొన్నారు. నుతించారు. ఐతే, భగవాన్ రమణులు మాత్రము "అరుణాచల శివ" అనే పిలిచారు, తలచారు, ప్రస్తుతించారు. ఒకమారు చిదంబరం దీక్షితారు భగవానులను చిదంబరానికి ఆహ్వానించాడు. భగవాన్ ఆయనతో, "సర్వేశ్వరుని నుండి శక్తి పుట్టింది. ఆశక్తి నుండి పంచ భూతాలు పుట్టాయి. అందుచే పంచభూతాలకు శక్తి అధిపతి, ఇక పంచభూతాలు శక్తిలో కలసిపోయిన స్థలము చిదంబరము. ఇదంత ముఖ్యము కాదు. పంచభూతాత్మకమైన శక్తి కలసిపోయిన స్థలమే అతిప్రధానమైనది. ఎందుకంటే చిదంబరములో శక్తి కదలిక నృత్యము చేసింది. ఆమె నృత్యాన్ని ఆపుటకు పరమశివుడు తాండవం చేశాడు. ఇక్కడ అరణాచల శివుడు ఎప్పుడూ అచలంగా వుండి పోయాడు అందుచే శక్తి కూడా కదిలిక లేనిదై అరుణాచలుని యందలి ప్రేమచే ఆయనలో కలసిపోయింది. కావున ఈ అరుణాచలము అతి పవిత్ర క్షేత్రము: ఇంత పవిత్ర క్షేత్రాన్ని వదలి ఇతర క్షేత్రాలకు నేనెలా వెళ్ళేది? మీరే చెప్పండి" అన్నాడు.

ఒక భక్తుడు "నమశ్శివాయ" అని పలుమార్లు వ్రాసి భగవాన్‌కు సమర్పిస్తూ "భగవాన్! ఈ పుణ్యఫలముతో నన్ను కాశీలో మరణించునట్లు అనుగ్రహించండి. కాశీలో మరణిస్తే పుణ్యము వస్తుందట కదా!" అన్నాడు. భగవాన్ కొద్దిసేపు మౌనాంగా వుండి అరుణాచల పురాణములోని విషయాన్ని ప్రస్తావిస్తూ ఈ విధంగా అన్నారు. ఒకమారు "అరుణాచలశివ" అనుటతో మోక్షము వస్తుంది. ఇది పరమేశ్వరుని శాసనము ఇలాచేయండి.

అరుణాచలుడంటే భగవాన్‌కు అమిత ప్రేమ మరియు భక్తి అందుకే ఏదైనా వ్రాసేదానికి ముందు "అరుణాచల" అని వ్రాసి తరువాత పనిని సాగించేవారు. ఒకమారు భగవాన్ ఇలా అన్నారు. "మనంతట మనము

ఈ దేహాన్ని "నేను" అని అంటున్నాము. ఇదే విధంగానే శివుడు కూడా తనకు తాను అరుణాచలాన్ని "నేను" అని అంటున్నాడు. సాధకుడు అరుణాచలుని సన్నిధిలో సాధన ప్రారంభిస్తే అరుణాచలుని నుండి సంపూర్ణ సహకారము తప్పక లభిస్తుంది. అనేక పవిత్ర స్థలాలు, పవిత్ర మందిరాలు వున్నాయి. ఒక్కొక్క దానిలో ఒక్కొక్క దేవున్ని ప్రతిష్ఠించారు. ఐతే అరుణాచలుడు. ఇతరులచే ప్రతిష్ఠింప బడినవాడు కాదు. తనకు తాను వెలసిన ఆది దైవము స్వయంభూలింగము. అరుణాచలుని చుట్టూ ప్రదక్షిణ చేయడము సర్వవ్యాపకుడైన భగవంతుని చుట్టూ తిరగడమే అవుతుంది. కావున ప్రదక్షిణ అనేది నేరుగా భగవంతున కర్పించుకొనే భక్తియుతమైన పూజ. గిరి చుట్టూ తిరగడం ఎంతో శ్రేష్ఠము" ఈ విధంగా భగవాన్ అరుణాచలుని మహిమను గూర్చి అవకాశము లభించినప్పుడంతా చెప్పేవారు.

గిరిప్రదక్షిణ ప్రాధాన్యత తెలియజేయడానికి భగవాన్ భక్తులతో కలసి గిరిచుట్టూ తిరిగేవారు. గిరిప్రదక్షిణ సమయములో చాలా నెమ్మదిగా నడచి వెళ్ళేవారు. "గిరిప్రదక్షిణ దీక్షను ఆచరించండి" అని అందరకు చెప్పేవారు. అంతేగాని ఇతర దీక్షలను ఆయన ప్రోత్సహించలేదు. ఐతే వారు పండుముసలీ కావచ్చు బలహీనులు కావచ్చు ఎవరినీ వద్దనేవారు కారు. "ఆనందంగా వెళ్ళిరండి పరవాలేదు" అనేవారు ఈ గిరిప్రదక్షిణ అనే వ్రతము భగవాన్ రమణుల వలననే బహుళప్రచారానికి వచ్చిందని చెప్పక తప్పదు.

ఒకమారొక భక్తుడు భగవాన్ను ఈ విధంగా ప్రశ్నించాడు. "భగవాన్! భక్తివిశ్వాసాలు ఏమాత్రము లేకుండా గిరిప్రదక్షిణ చేస్తారనుకోండి అట్టివారిని కూడా అరుణాచలుడు కరుణిస్తాడా?" అందుకు భగవాన్,ఆహా! తప్పక కరుణిస్తాడు. ఎందుకంటే అరుణాచలుడు అగ్ని స్వరూపుడు ఉదాహరణకు చెబుతాను. వినండి అక్కడ అగ్నిమండుతూ వుంది అందరూ, దానిచుట్టు చేరారు. అక్కడ చేరిన వారందరకూ అగ్ని తన ఉష్ణాన్ని అవసరమున్నవారికి మరియు లేనివారికి సమానంగా అందిస్తుంది. అదే విధంగానే అరుణాచలుడు కూడా. అంతెందుకు,

లేకపోయినా అగ్నిని తాకితె చాలు. భేదము లేకుండా దహిస్తుంది. అట్లానే అరుణాచలునకు చేసే ప్రదక్షిణ ఫలితము కూడా వుంటుంది. భక్తివిశ్వాసాలు వున్నవా? లేవా? అనేవి కాదు ప్రధానము. గిరిచుట్టడమే ముఖ్యము అది చేస్తే చాలు. అంతా ఆయనే చూసుకొంటాడు. భక్తి విశ్వాసాలు లేకయే తిరిగాడనుకొందాము అట్టివారికి ప్రదక్షిణ అనే పుణ్యఫలము వలన భక్తివిశ్వాసాలను కలిగిస్తాడు. తన చుట్టూ మరలా మరలా తిరుగునట్లు చేస్తాడు. ఇదే అరుణాచలుని వింతైన మహిమ" అన్నారు భగవాన్.

భగవాన్‌రమణులు అరుణాచలునిపై కమ్మని కవితలను వ్రాశారు అందులో ఆయన "అరుణాచలుడు భక్తుల హృదయాన్ని అమృతముచే నింపే మహాత్ముడని కరుణాఘన నగమని నుతించాడు, పిలిచాడు, అంతేగాక అరుణాచలుడు తన ప్రియుడని, ఇష్టుడని, యోధుడని, తల్లియని, తండ్రియని, గురుడని, ప్రాపంచిక విషయాల నుండి రక్షించే రక్షకుడని, ప్రేమమయప్రభువని, అహంతని, భవరోగానికి తగిన మందని ఇలా పెక్కు విశేషణాలతో అరుణాచలున్ని స్తుతించాడు.

భగవాన్ రమణ మహర్షులు అరుణాచల మందలి గుహలలో నివసించాడు. కొండంతా పాదరక్షలు లేకుండగనే తిరిగాడు పక్షులతో, జంతువులతో, వృక్షాలతో, కొండలో తిరిగే పేదవారితో చాలా సన్నిహితంగా మెలిగాడు. అరుణాచలుడు తన సర్వస్వమని భావించాడు. అందుకే ఆయన కొండను వదలి వెళ్ళలేదు. ఆయన తల్లి మరియు బంధువులు ఎంత ఏడ్చి పిలిచినా తాను మాత్రము అరుణాచలము వదలి వెళ్ళలేదు. అరుణాచలుడు కూడా భగవాన్‌కు అపారమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఆశ్రయమిచ్చాడు తన యెుడిలో ఇముడ్చుకొన్నాడు. అందుకే వారిరువురిని ఎవరూ వేరు చేయలేక పోయారు. చివరకు కొండ పాద మందు శ్రీరమణాశ్రమము ఏర్పాటు కాగా భక్తుల సౌకర్యార్థము అక్కడ వుండిపోయాడు. అందరకూ దర్శనమిస్తూ తరింపజేశాడు. ఇట్టి మహానుభావుడు 1950 ఏప్రియల్ 14వ తేదీన దేహయాత్రను చాలించి జ్యోతి రూపంగా ఆగ్నేయదిశకు

వెళ్ళి ఆకాశమున కొంత సేపుండి తిరిగి తన తండ్రియైన అరుణాచలునితో లీనమయ్యాడు. శివరమణుల స్వరూపమే ఈ అరుణాచలము.

**అణ్ణామలై స్వామి :** ఈయన మద్రాసు రాష్ట్రములోని తొండన్‌కురిచ్చి అనే గ్రామములో 1906 నవంబరు 14వ తేదీన జన్మించారు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు సెల్లపెరుమాళ్ చిన్నప్పటి నుండి భగవంతుని ధ్యాసతో కాలం గడిపారు. తన 21వ ఏట తిరువణ్ణామలైలోని భగవాన్ శ్రీ రమణమహర్షుల సన్నిధి చేరి 10 సంవత్సరాలు ఆయనకు సేవలు చేసి అనుగ్రహమునకు పాత్రుడయ్యాడు. శ్రీరమణాశ్రమమునకు ప్రక్కనగల పలాకొత్తలో దాదాపు 10 సంవత్సరములు ఏకాంతంగా ఆత్మధ్యానము చేసి స్థితప్రజ్ఞుడయ్యారు. భగవాన్‌రమణులే ఈయనను అన్నామలై స్వామి అని పిలిచారు. నాటి నుండి ఈయన అణ్ణామలై స్వామి అనే పేరుతో పిలువ బడ్డారు.

ఈయనకు అరుణాచలుడంటే అమితభక్తి పలాకొత్తులో జీవించిన 60 సంవత్సరాలు కూడా అరుణాచలుని దక్షణ భాగమంతా కలయతిరిగారు ఎన్నో వింతలను, విశేషాలను అందు చూశారు. అందుకొక దృష్టాంతము ఈయన ప్రతిదినము ఉదయము మరియు సాయంకాలము కొన్ని మారులు అరుణాచలుని దక్షిణ భాగమందలి నైరుతిదిశలోని లోయకు పోయేవారు. ఒక సమయములో అందుండి ఒక గొప్ప వెలుగు తనకడకు వచ్చింది. అది కేవలం భౌతికమైన అనుభవమని ఆయన దానిని అంతగా పట్టించుకోలేదు. మరుసటి దినం కూడా అక్కడకు వెళ్ళారు. మరలా అదే కాంతి అనుభవము కలిగింది కానీ దాన్ని కూడా లెక్కించకుండా పోయారు. తరువాత మూడవ దినము కూడా ఇదే దృశ్యము కనిపించింది. అందుచే ఇక ఆ కాంతి వెంట పోయారు. అదొక చోటున అదృశ్యమయింది. ఆస్థలమునకు పోయి చూస్తే అక్కడ లింగాకృతిగల రాయి కొంచెము మాత్రమే కనిపిస్తుంది. దానిని చూచిన వెంటనే ఆనందానుభూతి అతిశయించింది. అది అరుణాచల పాదమని ఆయనకు తోచింది. తరువాత దానిని త్రవ్వి తీయించి తన ఆశ్రమానికి తెప్పించి అందు

ప్రతిష్ఠింప చేశారు. నాటి నుండి నిత్యము ఆ అరుణాచల పాదానికి పూజలు చేయించారు. ఆయన దాని మహత్తును గూర్చి ఇలా వివరిస్తారు. "ఇది సాధారణమైన శిల కాదు. ఇది సాక్షాత్తు అరుణాచలుని పాదము. దీనికి గొప్పశక్తి కలదు. అరుణాచలునికి ప్రదక్షిణ చేయలేని వారు ఈపాదానికి ప్రదక్షిణ చేస్తే చాలు కోరిన కోరికలు నెరవేరుతాయి. ఇది శ్రీ చక్రస్వరూపము" అని పదేపదే చెప్పేవారు.

ఎవరైనా కష్టాల్లో వుండి తన చెంతకు వచ్చి ప్రార్థిస్తే "భగవాన్ రమణమహర్షులు వ్రాసిన అక్షర మణమాలను చదవండి" అని చెప్పేవారు అంతేగాక కొందరికి కొండవైపు వెళ్ళి లింగాకృతి గల శిలలను మోసుకువచ్చి ఇచ్చేవారు. "ఇది అరుణాచలుని బ్యాంకు నుండి తెచ్చిన కొంత సొమ్ము. డీనికి ప్రదక్షిణ చేసి మీ యింటిలోనే పూజలు చేయండి అరుణాచలుడు అనుగ్రహిస్తా"డని చెప్పేవారు. ఈవిధంగా ఆయన తెచ్చియిచ్చిన అరుణాచల శిలలు దేశ విదేశాలలో ఎన్నో వుండిపోయాయి. నిత్యము అందరిచే పూజలు పొందుచున్నాయి. శాంతిని ప్రసాదిస్తున్నాయి.

ఈయన తన చెంతకు వచ్చిన వారికి అరుణాచల మహిమలను వివరించేవారు. వారు నేను అడిగిన ప్రశ్నలకు తగిన విధంగా సమాధానాలను చెప్పేవారు కొన్నింటిని ఇందు వివరిస్తాను.

ప్రశ్న : అరుణాచలము అన్ని పర్వతాల వలె అతి సాధారణంగా కనిపిస్తుంది. ఐతే మహనీయులందరు ఆ పర్వతాన్ని జ్ఞాన స్వరూపమని చెబుతారు. ఇది వారికి ఏవిధంగా తెలిసినట్లు?

జవాబు : భగవాన్ రమణమహర్షులు కూడా నీవలె, నావలె, అందరివలె సాధారణ మనిషి ఐతే భగవాన్ను నేను తెలుసుకొన్నట్లు నీవు తెలసుకోలేవు. అందుచే పరిశుద్ధాత్ములైన వారు మాత్రమే అరుణాచలుని మహత్తును దర్శింపగలరు మరియు తెలసు కోగలరు. చాలా మంది ఫక్వజీవులు అరుణాచలునిచే ఆకర్షించబడి, చెంతచేరి, సాధనచేసి ముక్తిని పొందారు. మోక్షము కావాలనుకొన్నవారిని ఆకర్షించి

మోక్షాన్ని ప్రసాదించే జ్ఞానస్వరూపమే ఈ అరుణాచలము ఇది మహనీయులు తెలుసుకొని చెప్పిన పరమ సత్యము.

ప్రశ్న : అరుణాచలునితో సంబంధము మనస్సుతోనా? లేక హృదయముతోనా?

జవాబు : భగవాన్ రమణ మహర్షుల వ్రాసిన అక్షర మణమాలలో ఈ రెండు రీతులును చెప్పబడెను.

1. అరుణాచలమనుచు స్మరియించువారల అహము నిర్మూలింపు మరుణాచలా! (ఇది మనస్సుతో)

2. అళగు సుందరముల వలె చేరి నేను నీ వుందమభిన్నమై అరుణాలచలా! (ఇది హృదయముతో)

కావున మనస్సుతోను, హృదయముతోను సంబంధము కలిగి యుండవచ్చును.

ప్రశ్న : కొందరకు అరుణాచలుని మీద భక్తి యుండదు. వారేమో ఇక్కడ నివనిస్తుంటారు. వీరిపై అరుణాచలుని శక్తి ప్రసారమౌతుందా? వారికి మంచి జరుగుతుందా? వివరించండి.

జవాబు : అరుణాచలుని కరుణ అందరిపై ప్రసారమవుతుంది. ఇందులో సందేహములేదు, అరుణాచలమంటే స్వచ్ఛమైన జ్ఞానము అంతేగాని రాళ్ళసముదాయము కాదు. ఇక్కడ వున్నంత మాత్రాన భక్తిలేని వారికి భక్తిని కలిగిస్తాడు. తనవైపు లాగుకొంటాడు. భక్తియున్నవారిని ముందుకు నడిపిస్తాడు. సందేహములేదు.

ప్రశ్న : ఈ కొండ చుట్టూ 48 కి.మీ పరిధిలో నివసించే వారందరూ ఎట్టి ప్రయత్నము లేకయే మోక్షాన్ని పొందగలరు" అని మన శివపురాణాలు చెబుతున్నాయి. ఇందుకు మీ అభిప్రాయమేమి?

జవాబు : ఇందుకు నా అభిప్రాయము ఏమంటే : మోక్షము కావాలనుకొన్నవారు అరుణాచలున్ని మరువకుండా వుండాలి అరుణాచలునిపై విశ్వాసము కలిగి వుండాలి ఆయనకు శరణాగతి

చెందాలి ముక్తిపై ఆశక్తి కలవారు అరుణాచలుని చుట్టూ 48 కి.మి లో వుంటూ సాధన చేస్తే మిక్కిలి త్వరగా ఫలితమును పొందగలరు. ఇది సత్యము.

ప్రశ్న : గిరి ప్రదక్షిణ ఫలమేమి? అది ఆత్మధ్యానము వంటి ఫలితాన్ని ఇస్తుందా?

జవాబు : అరుణాచలము ప్రసాదించేది ఆత్మశక్తినే. నీవు నిశ్చలంగా, ఆత్మవిచారణతో గిరిప్రదక్షిణ చేసినట్లయితే నీవు సత్సంగముతో చరించినట్లే అప్పుడు అరుణాచలుని గొప్ప అనుగ్రము నీపై ప్రసారము కాగలదు. నీవు నిర్మలమైన మనస్సుతో, అణకువతో, పవిత్రతతో గిరిచుట్టూ తిరిగినట్లయితే తప్పక అనుభవాన్ని పొందగలవు పరమాత్మ చింతనతో గిరిప్రదక్షిణ చేస్తే శరీరమూ, మనస్సు రెండూ శుద్ధమౌతాయి. ఈ లక్ష్యముతో గరిప్రదక్షిణకు వెళ్ళండి. ఆత్మధ్యానము చేస్తూ గిరిచుట్టూ తిరగండి. ఇతర సమయాలలో ఒక చోట కూర్చొని ధ్యానము చేయండి. సత్ఫలితాన్ని తప్పక పొందగలవు ధ్యానము మరియు గరిప్రదక్షిణ రెండూ దేహాత్మభావమును తొలగించి పరమాత్మభావను కలిగించేవే.

ప్రశ్న : ఐతే అరుణాచలము "అరుణాచలా!" అని స్మరించినంతనే భక్తులను మరియు ఆత్మజ్ఞానము కావలెననెడి జిజ్ఞాసపరులను ఆకర్షిస్తుందన్నమాట.

జవాబు : ఔను! ఇది ముమ్మాటికీ సత్యము. అయస్కాంతము ఇనుమును ఆకర్షించునట్లు అరుణాచలము భక్తులను ఆకర్షిస్తుంది. తరువాత వారిని కాలినడకన తనచుట్టూ తిరుగునట్లు చేస్తుంది. "నావద్దకు రండి ప్రదక్షిణ చేయండి" అని మాత్రము చెప్పదు. ఆపర్వతానికి అవసరము కూడా లేదు. అరుణాచలుని శక్తి ప్రదక్షిణ చేయాలను కొన్నవారిని యాంత్రికంగా ఆకర్షిస్తుంది. నేను శ్రీ రమణాశ్రమంలో బిల్డింగు పనులతో పగలంతా మునిగి యుండేవాన్ని రాత్రి విశ్రాంతి తీసుకొనే సమయములో తలవని తలంపుగా గిరిప్రక్షిణ చేయాలనే కోరిక కలిగేది. అందుచే నేను వందసార్లు గిరిప్రదక్షిణలు

చెశాను. ఆనందాన్ని అనుభవించాను. ఐతే పలాకొత్తులో చేరిన తరువాత ప్రదక్షిణలు చేయడం మానివేశాను. కానీ అరుణాచలుని దక్షిణభాగమంతా కలయదిరిగాను. ఎన్నో అద్భుతాలను, మహిమలను తెలుసుకొన్నాను. నిజంగా అరుణాచలుడు మహనీయమూర్తి.

పుష్పము వికసించి పరిమళమును వెదజల్లుతుంది. అందుచే తేనెటీగలు వచ్చి ఆ పూవును ఆకర్షించి ఆందలి మకరందాన్ని గ్రహిస్తాయి. ఐతే అదే పువ్వులు పరిమాళాన్ని వెధజల్లక పోతే అక్కడ సువాసన వుండదు, మకరందమూ వుండదు, తేనెటీగలు వుండవు. ఈ విధంగానే అరుణాచలుని శక్తి ప్రసారము జరుగకపోతే అక్కడ మహత్తు వుండదు, ఆనందమూ ఉండదు, భక్తులూ వుండరు.

భగవాన్ రమణ మహర్షులు "అక్షరమణమాల"లో అరుణాచలుని గొప్పదనాన్ని గూర్చి "అరుణాచలా! నీవు నన్ను ఆకర్షించావు. నీలో నన్ను ఒకనిగా చేశావు" అని నుతించారు.

> "పేరు దలపగనే పట్టి లాగితివి నీ
> మహిమ కనుదురెవరు అరుణాచలా!
>
> ఇల్లు విడువలాగి లోనింటిలో జొచ్చి
> యొగి నీదు యిలుజూపి తరుణాచలా!
>
> చింతింప కృపపడ సాలీడువలె గట్టి
> చెఅబెట్టి భక్షించి తరుణాచలా!' (అక్షరమణమాల)

ఈ విధంగా అణ్ణామలైస్వాముల వారు తన కడకు వచ్చిన వారికి అరుణాచలుని మహిమలను మరియు శ్రీరమణ మహర్షి బోధలను వివరిస్తూ 1995 నవంబరు 9వ తేదీన తనువు చాలించి తన గురుదేవులు లీనమైన అరుణాచలంలోనే లీనమయ్యారు. ఆయన సమాధి శ్రీ అణ్ణామలై స్వామి ఆశ్రమములో ఉన్నది. ఆయనకు అక్కడ నిత్యమూ పూజలు జరుగుతున్నాయి.

# 5.అరుణాచలేశ్వరుని దేవాలయము

అరుణాచలేశ్వర దేవాలయమునకు తూర్పునగల పెద్దగోపురము నుండి ప్రవేశిస్తే ప్రతిఒక్కరు ఆ దేవాలయ పవిత్రతను, మనోహర వైభవాన్ని చూడగలరు. అంతేగాదు ఆధ్యాత్మిక తత్వమైన ఆనందాను భూతిని వెంటనే పొందగలరు. అందలి గోపురాల మనోహరత చెప్పసాధ్యము కాదు. ఈ గోపురాలను ప్రాచీనకాలము నాటి రాజులు దైవానికి కానుకగా కట్టించారు. ఈ గోపురాల వైభవము తమిళగ్రంధాలైన తేవారములోను, తిరువాచకములోను చక్కగా వర్ణింపబడినది. ప్రతి ప్రాకారము దేవతలగుడులు, కోనేరులు, తోటలు, విశాలమైన బయలు స్థలాలతో ఒప్పియున్నది. దేవళములో అనేక దేవతావిగ్రహాలు వెలిసియున్నాయి. వీటితో పరివేష్ఠితుడై తేజోలింగ స్వరూపుడుగా అరుణాచలేశ్వరుడు, ప్రకాశిస్తూ కొలువైయున్నాడు. ఈ లింగము కేవలం భౌతికమైనది కాదు. ఇది సర్వవ్యాపకమైన పరమేశ్వరుని శక్తి స్వరూపము. ఇక్కడ నుండే శక్తి ప్రారంభమై అంతటా వ్యాపిస్తున్నది. ఇది ప్రాచీన కాలపు ఋషులు మరియు గొప్పభక్తులు తెలిపిన పరమసత్యము.

పరమ విశిష్టమై, వైభవోపేతమై విరాజిల్లే అరుణాచలేశ్వర దేవాలయమును గూర్చి మనము తెలుసుకొన్నచో తప్పక పుణ్యము లభించును. ఈ దేవాలయానికి ఆరు ప్రాకారములున్నవి. ఆరవ ప్రాకారము యొక్క ఉత్తర దక్షిణమందలి గోడల పొడవులు 1479 అడుగులు మరియు 1590 అ॥ కలిగియున్నవి. ఇదే ప్రాకారపు తూర్పు పడమరల యందలి గోడల పొడవులు 700 అడుగులు. ఈ ప్రాకారాన్ని చూస్తే ఆశ్చర్యమౌతుంది. గోడలన్నీ దాదాపు 30 అ॥ ఎత్తుతో మందంగా, దృఢంగా వున్నాయి. ఈ గోడపై శాసనాలు చెక్కియున్నారు. ఐతే అవన్నీ వరుస క్రమంగా లేవు. ఈ ప్రాకారమందు నాలుగు ప్రధాన గోపురాలు వెలసియున్నాయి.

ఈ గోపురాలు విశాలమైన రాతి పునాదిని కలిగియున్నాయి. వీటిని

విజయనగర సామ్రాజ్యమును పాలించిన శ్రీకృష్ణదేవరాయలు కట్టించినట్లు తెలియుచున్నది. నిజంగా ఈ దేవాలయ నిర్మాణమునకు ఆయన అందించిన సేవ మరియు సహాయము చాలా గొప్పది. అరుణాచలేశ్వర దేవాలయమునకు తూర్పున యున్న మొదటి గోపురము పేరు రాజగోపురము. ఇది దక్షిణ భారత దేశములోనే మిక్కిలి పెద్దదైన, ఎత్తైన గోపురము. దీనిని శ్రీకృష్ణదేవరాయులు కట్టించారు. అంతేగాక ఈయన వేయిస్తంభాల మంటపాన్ని కూడా కట్టించాడు. ఇది తరువాత వచ్చే తూర్పు ప్రవేశద్వారానికి ఉత్తర దిశయందున్నది దీనికి దక్షిణాన శివగంగ తీర్థమున్నది. దీనిని కూడా శ్రీ కృష్ణదేవరాయలే ఏ ర్పాటు చేయించి వున్నాడు. దీని ఒడ్డున కార్తికేయ దేవాలయము కలదు దీనిని "వలైకాపు మంటపము" అని పిలుస్తారు. ఇక్కడ ప్రతి సంవత్సరము దేవతను గాజులతో పూజించే పండుగ జరుగుతుంది. ఈ దేవాలయములో ఒక స్తంభమున్నది. ఈ స్తంభమునుండే సుబ్రహ్మణ్యస్వామి సాధువైన అరుణగిరినాధునకు దర్శనమిచ్చాడు ఇక్కడనే ప్రభువైన మురగన్ పండుగ జరుగుతుంది. శివగంగతీర్థానికి పడమటి తీరాన గణేశ దేవాలయమున్నది. దీనిని సర్వసిద్ధి వినాయకుని గుడి అంటారు. అంతేగాక శివగంగై గణేశ దేవాలయమని కూడా పిలుస్తారు.

దీని తరువాత మనము పాతాళలింగము కడకు వస్తాము. ఇక్కడ వేయిస్తంభాల మంటపము కలదు. దీనిని శ్రీ కృష్ణదేవరాయలు కట్టించారు. తమిళమాసమైన అగ్నిమాసమందు (జూన్, జూలై) మరియు మార్గశిర మాసమందు (డిశంబరు, జనవరి) ఆచారప్రకారము నటరాజస్వామి విగ్రహాన్ని తీసుకొని వచ్చి ఇక్కడ వుంచుతారు. అభిషేకాలు, పూజలు చేసిన పిమ్మట వైభవంగా ఆయనను పల్లకిలో కూర్చుండబెట్టి దేవాలయము చుట్టూ వున్న వీధుల వెంబడి ఊరేగిస్తారు.

ఈవేయి స్తంభాల మంటపము కొలతలు తూర్పుపడమరలు 275 అడుగులు, ఉత్తర దక్షిణాలు 395 అడుగులు. పూర్వకాలములో ఈ మంటపముధ్యానము చేసుకొనేవారికి రక్షణ ఇచ్చింది. ఇంతేగాక ప్రకృతి

విపరీతాలు వస్తే జనులకు ఆశ్రయమిచ్చి ఆదుకొన్నది. ఇక్కడుండే పాతాళలింము ముఖ్యంగా దర్శింపదగినది. ఇందే భగవాన్ రమణులు మౌనంగా ధ్యానము చేశారు. ఈ దేవాలయాన్ని దర్శించేవారు తప్పక ఇందలి పాతాళలింగమును దర్శిస్తారు. భగవాన్‌రమణులను స్మరిస్తారు.

దీని నుండి బయటకు వచ్చి కొంచెము దూరము పోతే పెద్ద నంది విగ్రహము కనిపిస్తుంది. ఇది చూడ ముచ్చటగా వుంటుంది. ఇందులో జీవకళ ఉట్టిపడతూ వున్నది. దీనికి మంటపము కూడా ఏర్పాటు చేయబడి వున్నది. తరువాత పోతే మెట్లు వస్తాయి. వాటికి దక్షిణాన కళ్యాణ సుందరుని సన్నిధి ఏర్పాటు చేయబడి వున్నది. ఇందు చిన్న శివ మందిరము, విరబూసిన పూదోట మరియు మంటపమున్నది. ఇక ఉత్తరాన గోపురపు సుబ్రమణ్యస్వామి దేవాలయము కలదు. దుఃఖితుడైన అరుణగిరి నాథుడు ఆత్మహత్య చేసుకొనుటకు ఆ గోపురమెక్కి దూకగా సుబ్రమణ్యస్వామి వచ్చి తన రెండు చేతులతో అతనిని తీసుకొని రక్షించెను. ఈ సంఘటన జ్ఞాపకార్థము శివ గంగ తీర్థానికి సమీపములో గుడి కట్టబడి యున్నది.

ఇక మెట్లెక్కి వల్లాల గోపురం దాటి నాల్గవ ప్రాకారములోనికి వస్తాము. అప్రాకారంలో దక్షిణమందు మరొక తీర్థము కలదు. దాని పేరు బ్రహ్మతీర్థము దాని తీరాన కాలభైరవుని మందిరము కలదు. ఇక్కడ భైరవుడు రుద్రరూపముతో దర్శనమిస్తాడు. ఈ భౌరవుడు అరుణాచలేశ్వర దేవాలయాన్ని కావలికాచే దేవ దూతయని అంటారు తరువాత స్తంభాల మంటపము. దానికి ముందు మరొక నంది ప్రత్యక్షమౌతుంది. దాన్ని చూసాపోతే మెట్లు వస్తాయి. వాటికి దక్షిణాన చిన్న చిన్న శివమందిరాలున్నాయి. ఉత్తరాన మురగన్ గుడి వున్నది. మెట్లెక్కి కిలీ గోపురము నుండి పోతే మూడవ ప్రాకారము వస్తుంది. ఇందు 16 స్తంభాల మంటపమున్నది. దీని పేరు దీపదర్శన మంటపము. కార్తీక దీపోత్సవము నాడు ఇక్కడ విగ్రహాలను కొండ ముఖముగా వుంచి కొండశిఖరముపై వెలిచించే జ్యోతిని వాటికి చూపిస్తారు. ఈ మంటపానికి ముందు ధ్వజస్తంభమున్నది. ఇక్కడ ఎగుర వేసే పతాకము

ఉత్తరాయణ, దక్షిణాయణ, కార్తీకదీపోత్సవ పండుగల ప్రారంభమును తెలియ జేస్తుంది. భగవాన్ రమణులు అక్షరమణమాలలో ఆ పతాక ప్రాధాన్యతను ఇలా తెలియజేశారు.

"ఓ అరుణాచలా! నీభక్తుల హృదయాలలో పతాకాన్ని ఎగురవేసి వారి అహమును నాశనము చేయుము". అని ఇక రమణస్తుతిపంచకములో "ఎవరైతే అరుణాచలున్ని భక్తి శ్రద్ధలతో పూజిస్తారో అట్టివారి మదిలో, తన పతాకిన్ని ఎగురవేసి జ్ఞానాన్ని ప్రసాదించి భవసాగరము నుండి తరింపజేస్తాడు". అని వివరించాడు. కార్తీక దీపోత్సవ మందలి ధ్వజరోహణ కార్యక్రమమును తిలకించడానికి లక్షలాది మంది భక్తులు వస్తారు. తిలకించి తమ జన్మలు ధన్యమైనట్లు భావిస్తారు.

బలిపీఠము దాని తరువాత ధ్వజస్తంభము తరువాత నంది వున్నది. దీనిని "ప్రదోషనంది" అంటారు. ఇక్కడ నెలలో రెండు మారులు ప్రదోషసమయాన నందికి అభిషేకార్చనలు చేస్తారు. అంతేగాక ప్రతినిత్యము అక్కడే ఉదయం 6-00 గం,లకు గోపూజ జరుగుతుంది. తరువాత అరుణాచలేశ్వర పూజా కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు.

మూడవ ప్రాకారమున దీపదర్శన మంటపానికి దక్షిణమున వంటశాలలున్నవి. ఇంకా కొన్ని గదులున్నవి. ఇవి దేవాలయపు పనులకు ఉపయోగపడును. దక్షిణ నైరుతిలో పెద్ద కళ్యాణమంటపము వున్నది. దీపోత్సవము నాడు అరుణాచలేశ్వరునితో సహ ఇతర ఉత్సవ విగ్రహలను తెచ్చి ఇక్కడ వుంచుతారు. దీనికి వెనుక అరుణగిరి యోగి మంటపమున్నది. ఇక దీపదర్శన మంటపానికి ఉత్తరాన వేర్వేరు శివ మందిరములు కలవు. దేవస్థానము ఆఫీసు వున్నది. ఈ ఆఫీసుకు సమీపంలో పిడారి అమ్మన్ మందిరము కలదు. ఈ తల్లి గ్రామదేవత. తిరువణ్ణామలై పట్టణాన్ని ఉపద్రవముల నుండి కాపాడుతూ వుంట్నుదని అందరూ భావిస్తారు. పదునాలుగు రోజుల పాటు జరిగే దీపోత్సవపు పండుగలో రెండవ రోజున పిడారి అమ్మన్ శాంతి కోసము పూజలు

చేస్తారు.

ఇక రెండవ ప్రాకరపు ప్రవేశానికి ఇరువైపుల సంబంధ వినాయకుడు, పలని ఆండావారులు వెలసియున్నారు. వీరిని చూస్తూ రెండవ ప్రాకారములోనికి ప్రవేశిద్దాము. పెద్ద తలుపులుగల గడప దాటితే వాటికి ఇరువైపుల రెండు పెద్ద గంటలు కలవు. వీటి ధ్వనిచాలా గంభీరమైనది. ఈ గంటల మ్రోతలు కడుదూరము వినిపిస్తాయి. ఈ గంటలను మ్రోగిస్తారు. ఈ గంటల మ్రోతలు ముఖ్యంగా కొండగుహలలో తపమాచరించేవారిని మిక్కిలి ఆకర్షిస్తాయి. ఇక ప్రాకారము చుట్టూ తిరుగుతూ పోతే లెక్కలేనన్ని విగ్రహాలను మనము చూడవచ్చును. గిరిప్రదక్షిణ సమయాన ప్రత్యేక స్థలాలలో మనము అష్టలింగాలను చూచునట్లు ఇక్కడ కూడా అష్టలింగాలను చూడ వచ్చును. బ్రహ్మమానస పుత్రులను, 63 మంది శైవసాధువులను, అణ్ణామలైయార్ మరియు ఉణ్ణామలై అమ్మన్ ఉత్సవవిగ్రహాలను, వేణుగోపాలస్వామి, లక్ష్మి గణేష్, మురగ, సప్తకన్యలు, బిచ్చాధన, భైరవ, నటరాజు మరియు రాగితో చేయబడిన 63 మంది సాధువుల విగ్రహాలను మనము చూడవచ్చును. ఇవన్నీ ఉత్సవసందర్భాలలో ఊరేగింపు కోసము బయటకు తెస్తారు. అంతేగాక దేవీ దేవునకు అక్కడ ఒక విడిదిగది వున్నది. దానిని కూడా మనము చూడవచ్చును. రెండవ ప్రాకారానికి ముందు విశాలమైన బయలు స్థలము అందునంది వెలసియున్నది. దీనికి ముందు మొదటి ప్రాకారము కలదు. దీని చుట్టూవున్న గోడల మీద విగ్రహాలను చూడవచ్చును. దక్షిణ గోడమీద దక్షిణామూర్తి విగ్రహాన్ని చూడవచ్చును. ఆయన సర్పాన్ని చేత బట్టుకొని, రుద్రాక్షమాలలను మెడలో ధరించి, అగ్ని మరియు పుస్తకము కలవాడై మఱ్ఱివృక్షము క్రింద కూర్చొని బ్రహ్మమానస పుత్రులకు జ్ఞానబోధ చేస్తున్నారు. ఇక పడమటి గోడమీద జ్యోతిస్తంభమైన లింగోద్భవ ప్రతిమను చూడవచ్చును. ఉత్తర దిశలో దుర్గాదేవి విగ్రహాన్ని చూడవచ్చును. ఆమె భయంకర రూపముతో విలసిల్లుతూ వుంది.

**గర్భగుడి** : ఇక మనము గర్భగుడిలో వెలసిన అరుణాచలేశ్వరుని పాదపద్మాల చెంతకు వస్తాము. ఇది స్వయంభూతేజోలింగము. చాలా మనోహరమైనది. మనస్సును ఆకర్షించి అలరించే ముగ్ధమోహన లింగము. అరుణాచలలేశ్వరుడు కనకపు సింహాసనమున పట్టాభిషిక్తుడైయున్నాడు. పంచభూతాత్మకమైన ఐదు లింగాలలో (1) పృథివీ భూత లింగము, కాంచీ పురము (2) జలభూత లింగము జంబుకేశ్వరము (3) తేజోభూత లింగము, అరుణాచలము (4) వాయు భూత లింగము, శ్రీకాళహస్తి (5) ఆకాశభూత లింగము, చిదంబరము. ఈ లింగమొకటి. దీనిని తేజోలింగము లేక అగ్ని లింగమని అంటారు. ఈ తేజోలింగము ఇప్పటికి కోట్లాది అభిషేకాలతో, చందనపూతలతో, వేద మంత్రాలతో కూడి ప్రకాశిస్తూ వుంది. ఈ లింగాన్ని పలు కోణాల నుండి వీక్షిస్తే పలువిధాలుగా కనిపిస్తుంది. ఈ అరుణాచలేశ్వరుడు బ్రహ్మావిష్ణు శక్తి స్వరూపాలతో ఒప్పియున్నాడు. అందుచే ప్రత్యేకంగా ఇతర దేవతలను మంత్రాలతో పూజించవలసిన అగత్యము లేదు. ఈ అరుణాచలుని పూజిస్తే సర్వదేవతలను పూజించినట్లే!

అరుణాచలేశ్వరుని దర్శించి రెండవ ప్రాకారమండలి ఉత్తరానగల ద్వారము వెంట బయటకు వస్తే అమ్మకోవెల కనిపిస్తుంది. అమ్మకోవెల ముందు విశాలమైన స్తంభాల మంటపమున్నది. అందు నవగ్రహాలు ప్రతిష్ఠింపబడి యున్నవి. గుడి ప్రవేశద్వారానిక దక్షిణాన పెద్ద వినాయకుని విగ్రహము కలదు. ఉత్తరాన కార్తీకేయుడు మరియు కొన్ని దేవతా విగ్రహాలు వున్నవి. లోనికి పోతే ప్రాకారపు స్తంభాలయందు అష్టలక్ష్మి విగ్రహాలు వెలసియున్నవి. వాటిని చూస్తూ గర్భగుడిలోనికి ప్రవేశిస్తే అమ్మ దివ్య మంగళ రూపమును చూడవచ్చును. ఇక్కడ వెలసిన అమ్మపేరు "అపీతకుచాంబ" పార్వతీదేవి అరుణాచలుని గూర్చి తపము చేసి, మెప్పించి, వరమును పొంది ఇక్కడ జగన్మాతగా వెలసింది. పార్వతీ పరమేశ్వరుల సంగమమే ఈ అరుణాచలేశ్వర దేవాలయము.

ఈ దేవాలయము అతిపవిత్రమైనది. గొప్ప మహిమ కలది. ఇంత

విశాలమైన శివాలయము మరెక్కడనూ లేదు. ఈ అరుణాచలేశ్వరుని పూజించుటకు, ఉత్సవాలను తిలకించుటకు దేవతలు, సిద్ధపురుషులు, గంధర్వులు వస్తుంటారు. సర్వులకు పూజ్యుడైన అరుణాచలేశ్వరున్ని దర్శించి తరిద్దాం.

## 6. అరుణాచల శంకర నామావళి

గౌతమమహాముని అరుణాచలుని చెంత చేరి పలువిధాలుగా ప్రశంసించి, మెప్పించి, ఆయన నుండి అరుణాచల మహాత్యమును, పూజావిధానము, నామావళిని తెలుసుకొన్నాడు. అరుణాచల శివుడు తన నామావళిని గౌతమునకు తెలుపుతూ "ఎవరైతే ఈ నామావళిని మరియు పురాణములందలి మరికొన్ని పేర్లను ప్రతిదినము పఠిస్తూ పూలను నాకర్పిస్తారో అట్టివారు సుఖాశాంతులతో జీవించగలరు" అని కరుణించి యున్నాడు. ఇది స్కాందపురాణములో వివరించబడినది. ఆ నామావళిని పఠించేందుకు తగిన విధంగా ఇందు వ్రాయబడెను. భక్తులు ఈ అరుణాచలేశ్వర నామావళిని ప్రతిదినము పఠించి పూజించినచో తప్పక అరుణాచలుని అనుగ్రహములకు పాత్రులగుదురు.

### అరుణాచల నామావళి

1. ఓం శ్రీ శోణాద్రీశాయ నమః
2. ఓం అరుణాద్రీశాయ నమః
3. ఓం దేవాధీశాయ నమః
4. ఓం జనప్రియాయ నమః
5. ఓం ప్రసన్నరక్షాయ నమః
6. ఓం ధీరాయ నమః
7. ఓం శివసేవక వర్ధకాయ నమః
8. ఓం అక్షిపేయాయ నమః

9. ఓం అమృతేశాన నమః
10. ఓం స్త్రీపుంభావప్రదాయకాయ నమః
11. ఓం భక్తి విజ్ఞాపిత సంధాత్రేయ నమః
12. ఓం దీనబంధవిమోచకాయ నమః
13. ఓం ముఖిరాంఘ్రిపతినే నమః
14. ఓం శ్రీమతే నమః
15. ఓం ముంటినే నమః
16. ఓం మృగమదేశ్వరాయ నమః
17. ఓం భక్త ప్రేక్షణ కృతాయ నమః
18. ఓం సాక్షిణే నమః
19. ఓం భక్తదోషనివర్తకాయ నమః
20. ఓం జ్ఞానసంబంధనాథాయ నమః
21. ఓం శ్రీ హాలాహల సుందరాయ నమః
22. ఓం ఆహవాయ నమః
23. ఓం ఐశ్వర్య దాత్రే నమః
24. ఓం స్మృత సర్వాఘనాశనాయ నమః
25. ఓం వ్యత్యస్తనృత్య ధ్వజదృష్ట్యంత నటనేశ్వరాయ నమః
26. ఓం సామప్రియాయ నమః
27. ఓం కలిధ్వంసినే నమః
28. ఓం వేదమూర్తియే నమః
29. ఓం నిరంజనాయ నమః
30. ఓం జగన్నాధాయ నమః
31. ఓం మహాదేవాయ నమః

32. ఓం త్రినేత్రాయ నమః
33. ఓం త్రిపురాంతకాయ నమః
34. ఓం భక్తాపరాధసోఢృకాయ నమః
35. ఓం యోగీశాయ నమః
36. ఓం భోగనాయకాయ నమః
37. ఓం బాలమూర్తియే నమః
38. ఓం క్షమారూపిణే నమః
39. ఓం ధర్మరక్షాయ నమః
40. ఓం వృషధ్వజాయనమః
41. ఓం హరయే నమః
42. ఓం శ్రీగిరీశ్వరాయ నమః
43. ఓం భర్గేశాయ నమః
44. ఓం చంద్రరేఖావతంసకాయ నమః
45. ఓం స్మరాంతకాయ నమః
46. ఓం అంధకరిపుణే నమః
47. ఓం సిద్ధరాజాయ నమః
48. ఓం దిగంబరాయ నమః
49. ఓం ఆగమప్రియాయ నమః
50. ఓం ఈశానాయ నమః
51. ఓం భస్మరుద్రాక్షలాంఛనాయ నమః
52. ఓం శ్రీపతియే నమః
53. ఓం శంకరాయ నమః
54. ఓం స్రష్టే నమః

55. ఓం సర్వ విద్యేశ్వరాయ నమః
56. ఓం అనఘాయ నమః
57. ఓం గంగాధరాయ నమః
58. ఓం క్రతుధ్వంసినే నమః
59. ఓం విమలాయ నమః
60. ఓం నాగభూషణాయ నమః
61. ఓం బహురూపాయ నమః
62. ఓం అరుణాయనమః
63. ఓం విరూపాక్షాయనమః
64. ఓం అక్షరాకృతియేనమః
65. ఓం ఆద్యంతరహితాయనమః
66. ఓం శివకామినేనమః
67. ఓం స్వయంభువేనమః
68. ఓం సచ్చిదానందరూపాయనమః
69. ఓం సర్వాత్మనేనమః
70. ఓం జీవాధారకాయనమః
71. ఓం స్త్రీసంగవామభాగసుభగాయనమః
72. ఓం విధియేనమః
73. ఓం విహితసుందరాయనమః
74. ఓం జ్ఞానప్రదాయనమః
75. ఓం ముక్తిదాత్రేనమః
76. ఓం భక్తవాంఛితదాయకాయనమః
77. ఓం ఐశ్వర్యవైభవాయనమః

78. ఓం కామినేనమః

79. ఓం నిరవద్యాయనమః

80. ఓం నిధిప్రదాయనమః

81. ఓం శూలినేనమః

82. ఓం పశుపతియేనమః

83. ఓం శంభువేనమః

84. ఓం స్వయంభువేనమః

85. ఓం గిరీశాయనమః

86. ఓం మృడాయనమః

87. ఓం తామ్రాయనమః

88. ఓం తేజస్స్తంభాయనమః

89. ఓం శివాయనమః

90. ఓం పరమాత్మనేమః

91. ఓం సర్వవేదస్వరూపిణేనమః

92. ఓం నిత్యాయనమః

93. ఓం అమృతామృతాయనమః

94. ఓం కాలాయనమః

95. ఓం కరుణార్ద్రాయనమః

96. ఓం దృష్టిప్రేమామృతాబ్ధయేనమః

97. ఓం భక్తవాత్సల్య పూర్ణాయనమః

98. ఓం పుణ్యాయనమః

99. ఓం పురభేదినేనమః

100. ఓం శోణాచలకృతయేనమః

101. ఓం ప్రదక్షిణప్రియాయనమః

102. ఓం గౌతమప్రియానమః

103. ఓం సర్వపాపవినాశనాయనమః

104. ఓం సర్వవ్యాధివినాశినేనమః

105. ఓం స్మృతిమాత్రేణసంతృప్తాయనమః

106. ఓం జ్యోతిరూపాయనమః

107. ఓం చైతన్యస్వరూపిణేనమః

108. ఓం అపీతకుచాంబసమేత అరుణాచలేశ్వరాయనమః

ఇదే శ్రీ అరుణాచలేశ్వరుని అష్టోత్తర శతనామావళి (108 పేర్లు)

## 7. అరుణాచలుని భౌతిక స్వరూపము

తిరువణ్ణామలై పట్టణానికి తొమ్మిది ప్రవేశద్వారాలున్నాయి. వీటిలో ఏ ద్వారము నుండి ప్రవేశించినా 20 కి.మీ.ల దూరము నుండియే అరుణాచలుని భౌతికరూపము కనిపిస్తుంది. పూర్వమే దర్శించినవారికి తిరువణ్ణామలై సమీపించుకొలది అరుణాచలుని రూపము సర్వదాకనిపిస్తూ అలరింపజేస్తూ ఉంటుంది. అరుణాచలుని మహిమను చదివి మొదటిసారిగా చూడటానికి వచ్చేవారు ఆయన దర్శనభాగ్యము కోసము ఆపేక్షతో, వేయికళ్ళతో ఎదురు చూస్తూవుంటారు. తిరువణ్ణామలై పట్టణములోకి ప్రవేశిస్తేనే ఆ మనోహర మంగళ రూపాన్ని చూచి పొందే పారవశ్యాన్ని, మేలైన అనుభూతిని చెప్పతరము కాదు. తిరువణ్ణామలైలో స్థిరంగా వుంటూ తరచు గిరి ప్రదక్షిణలు చేస్తూ అనేక అనుభవాలు పొందుచున్నా మొట్టమొదట అరుణాచలుని భౌతిక స్వరూపాన్ని చూచినపుడు పొందిన ఆనందానుభూతిని మాత్రము ఎంతకాలనికి మరచిపోజాలరు. తిరువణ్ణామలై మీదుగా ప్రయాణము చేసేవారు తలవని తలంపుగా అరుణాచలుని చూచి వెంటనే మేను పులకించినవారు తన్మయులైనవారు ఎందరో వున్నారు. చాలా మంది భక్తులు తరుచుగా

అరుణాచలుని ముగ్ధమోహన రూపాన్ని చూచి భావోద్రేకాలతో మేను పులంకింప "నీ చేతుల్లోకి తీసుకో అరుణాచలా!" అని కన్నీళ్ళు జాలువార చేతులు జోడించి మౌనప్రార్ధన సాగిస్తుంటారు. కొందరు భక్తులు అరుణాచలుని వదలి వెళ్ళే సమయాన మరియు గిరి నుండి దూరమయ్యే సమయాన మాటిమాటికి ఆదివ్య మంగళ రూపాన్ని వెనుదిరిగి చూస్తారు. ఆయన ఎడబాటును సహించలేమంటూ కన్నీరురాలుస్తారు. దూరమయ్యే కొలది దివ్యానుభూతి కలుగుతుంది. ఆ కమ్మని అనుభవము తరువాత అరుణాచలుని దర్శించు వరకు వారి మదిలో పదిలంగా వుంటుంది.

దూరము నుండి చూచేవారికే అరుణాచలుడు గంభీరంగా ఉదాత్తంగా కనిపిస్తాడు ఒక్కొక్క పట్టణ ప్రవేశ ద్వారము నుండి చూస్తే ఒక్కొక్క రీతిలో చూడముచ్చటగా కనిపిస్తాడు. పజ్రపు పెట్టెలా తన అద్వితీయమైన కాంతిని చుట్టూ విరజిమ్ముతూ వుంటాడు.

హిమాలయా పర్వతాలకు, ఆల్ఫు పర్వతాలకు మరియు ఇతర సుప్రసిద్ధ పర్వతాలకు వెళ్ళివచ్చినవారు, "ఈ అరుణాచలము అన్ని పర్వతాలకంటే మించిన వైభవాన్ని, ఘనతను కలిగినది" అని పేర్కొన్నారు. పాల్ బ్రింటన్ వ్రాసిన "అరుణాచల వర్ణన" లోను మరియు అన్నేమార్షల్ వ్రాసిన, "సర్చ్‌ఫార్ యె గురు ఇన్ ఇండియా" అనే గ్రంథములోను అరుణాచలుని వైభవము, ఘనత చక్కగా వ్రాయబడియున్నది. వారు అరుణాచలుని సుందర భౌతికరూపాన్ని హృదయము స్పందించు రీతిలో వివరించియున్నారు.

ఈకొండ సుమారు 2668 అడుగుల ఎత్తుకంటే మించి వున్నది. తూర్పు పడమటి భాగాలలో కొంచెము ఎత్తు ఎక్కువగా వుంటుంది. ఇందలి పర్వతశిఖరాలు, మధ్యవున్నలోతైన లోయలు, కొండ చరియలు క్రమబద్ధము లేకుండా చీలియున్నాయి. దీనికి కారణము ఎవరికీ తెలియదు. అందుచేత ఈ కొండను సంపూర్ణంగా వర్ణించి చెప్పలేము. ఈ కొండ యొక్క తూర్పు ముఖము కంటే పడమటి ముఖము వెడల్పులో తక్కువగాను, ఇరుకుగాను వుంటుంది. తూర్పుముఖమంతా చాలా

సౌమ్యంగా ఉంటుంది. ఇది తిరువణ్ణామలై వైపు ముఖము కలిగి మనోహరంగా వుంటుంది. ఈ భాగములోనే చాలా గుహలున్నాయి. ఈ గుహలు అరుణాచలునితో బాటు ఆవిర్భవించాయి. ఈగుహలలో ఎందరో సాధువులు తపమాచరించారు. తూర్పునయున్న ఏటవాలు ప్రాంతములోనే పురాణాలలో చెప్పబడిన గొప్ప వటవృక్షము ఉన్నదట ఈ మఱ్ఱివృక్షము క్రిందనే అరుణాచలుడు అరుణగిరి యోగిగా సిద్ధస్వరూపముతో దక్షిణాభిముఖుడై ఆశీనుడై వున్నాడట. ఈయన కేవలం భగవాన్ రమణ మహర్షుల వంటి మహర్షులకే కనిపిస్తాడని ప్రతీతి.

దీపోత్సవము నాడు ఈ మెరకపల్లము గల దారి వెంట కొండ శిఖరాగ్రమునకు వెళ్ళి జ్యోతిని వెలిగిస్తారు. ఈలోయలో కొంచెము పైభాగమున స్కంధాశ్రమము కలదు. వర్షపు నీరంతా కేంద్రీకృతమై కొండపై నుండి బయలుదేరి వచ్చి స్కంధాశ్రమాన జలపాతంగా మారి క్రిందకు దూకుతూ ఆవిరి రూపంలో ప్రకాశించి తరువాత విరూపాక్షగుహ ప్రక్కన ప్రవహిస్తూ వెళ్ళి బయట స్థలములో కలసిపోతుంది. స్కందా శ్రమాన చిన్న జలపాతముగ దూకుతూ వుంటే అది అరుణాచలుని జడల నుండి వచ్చే గంగాజలంలా వుంటుంది. నిజంగా ఆజలము అరుణాచలుని అభిషేకపు జలము. వరుణదేవుని సాయమున వనదేవతలు అరుణాచలున్ని అభిషేకింపగా జాలువారే పవిత్ర అభిషేకపు గంగా జలమది. ఈ నీటిని త్రాగి చూస్తే ఈసత్యము ఎరుకపడుతుంది. ఈ జలము ఓషధుల మయము. కర్పూరపు వాసనతో కూడి కమ్మగా వుంటుంది. ఇక్కడున్న విరూపాక్ష గుహయందు శ్రీరమణ మహర్షులు 17 సంవత్సరాలు నివసించియున్నారు. స్కంధాశ్రమాన 7 సంవత్సరాలు నివసించి యున్నారు. ఈరెండిటిని శ్రీరమణాశ్రమము వారు అతి పవిత్రంగా వుంచారు. ఈరెండూ ముఖ్యంగా చూడదగిన గుహాప్రదేశాలు.

అరుణాచలుని దక్షిణముఖము ఉత్తరముఖము కంటే ఇరకైనది పొడవులోను, ఎత్తులోను ఉత్తరముఖమే పెద్దది. కొండ దక్షిణ ముఖానికి ఆగ్నేయదిశ భాగమందు పర్వత శిఖరపు పొరలున్నవి వీటి మధ్యనే గుహలున్నవి. ఈభాగము ఒక లోయగా కనిపిస్తుంది. వర్షపు నీరు ఈ

లోయ గుండా ఒక పెద్ద జలపాతంలా దూకుచూ ముందుకు సాగిపోతూ వుంటుంది. దక్షిణ ముఖము మధ్య భాగమంతా వివిధ వృక్షజాతులతో పచ్చగా కలకలలాడుతూ వుంటుంది. ముప్పై సంవత్సరాల క్రితము శ్రీరమణాశ్రమానికి వెనుకనున్న కొండ భాగమంతా వృక్షసంపద లేక యుండేది. ఐతే ఇప్పుడా ప్రదేశమంతా పచ్చని చెట్లతో ప్రకాశిస్తూ చూడముచ్చటగా వుంటుంది. శ్రీరమణాశ్రమము నుండి స్కంధాశ్రమానికి త్రోవయున్నది. ఈ దారికి ఇరువైపుల చెట్లువున్నవి. ఇవి చల్లని నీడనిస్తుంటాయి.

శ్రీ రమణాశ్రమము నుండి అరుణాచలున్ని చూస్తే వెంటనే ఒక అపురూపమైన అనుభూతి కలుగుతుంది. ఈ మనోహర రూపాన్ని చూస్తేనే శరీరము పులకిస్తుంది. ఆనందము అతిశయిస్తుంది. ఇక్కడ నుండి చూస్తే ఆయన నిండుగా, ఆనందంగా, మౌనంగా కనిపిస్తాడు. శ్రీరమణాశ్రమానకి వచ్చిన వాళ్ళందరిని ఆకర్షిస్తాడు. అందుకే భక్తులందరూ తదేకంగా ఆయనను చూస్తుంటారు. మైమరచి వుంటారు. ఇక్కడ నుండి చూస్తే మూడు గుట్టలు ఒకదాని కంటే ఇంకొకటి మించినవై కనిసిస్తాయి. భగవాన్ మంధిరము నండి చూస్తే అరుణాచలుడు పంచభూతాత్మకమైన మరియు ప్రకృతి పరమైన దుస్తులు ధరించి మనోహరంగా దర్శనమిస్తాడు. ప్రకాశవంతమైన ఉదయపు సూర్య కిరణాలతో దేదీప్యమానంగా వెలుగుతూ వుంటాడు. తెల్లటి మేఘాలు అరుణాచలున్ని అంటి పెట్టుకొన్నప్పుడు చూస్తే మేలిమి ముసుగులో దాగిన వైనము కనిసిస్తుంది. మేఘాలలో దాగి ముచ్చటగా వుంటాడు. వర్షము కురిసే సమయాన అందులో దాగి వున్నట్లు ముద్దుగా అగుపిస్తాడు. ఒక్కొక్కప్పుడు ఇంద్ర ధనుస్సు కిరీటంకాగా శోభాయమానంగా వుంటాడు. కారుమబ్బుల్లో మెరుపు కాంతులు కొండంతా వ్యాపింప ఆ మనోహరత చూడ అందంగా ఉంటుంది. పౌర్ణమినాటి పాలారవోసిన పండు వెన్నెలలో అరుణాచలుడు పవళించిన రీతి చూస్తే పారవశ్యము జనిస్తుంది. ఇదంతా చూచి ఆనందించ వలసినదే

కానీ చెప్పసాధ్యముకాదు. ఇక ఉత్తరాన యున్న కొండచరియల్లో పోవుటకు గానీ ఉండటానికి గానీ ఏ మాత్రము అవకాశము లేదు. కట్టెలు కొట్టేవారు మాత్రము పోతుంటారు ఇచ్చటే మహాప్రసిద్ధమైన ఓషధులు వున్నట్లు ప్రతీతి. ఉత్తర దిశలోని కొండ భాగము చాలా విశాలమైనది. తక్కిన దిశలలో భాగములందువలె ఇక్కడ ఎటువంటి పాయలుగానీ లేవు. ఏదియేమైనా ఉత్తరదిశాభాగము మనకు ఐదు పర్వతశిఖరాలను అందిస్తున్నది. కొండపాద సమీపాన ప్రదక్షిణ చేస్తూ పోయినట్లయితే అవి మనకు స్పష్టంగా, విశాలంగా కనిసిస్తాయి. బయటి మార్గము నుండి అంటే రోడ్డు నుండి ప్రదక్షిణ చేస్తూ గమనిస్తే అవన్నీ దగ్గర దగ్గర వున్నట్లు మరియు చివరి శిఖరము చాలా చిన్నదిగాను కనిపిస్తుంది.

ఈ కొండ దక్షిణదిశ పడమటి భాగములో (నైరుతి) మేరు రూపముతో దర్శనమిస్తుంది. మేరువు అనగా శక్తి స్వరూపమునకు చిహ్నమైన శ్రీ చక్రము. ఈ కారణము చేతనే శక్తిని ఆరాధించే శ్యాక్తికేయులు సైతము అరుణాచలున్ని శక్తిరూపంగా పూజిస్తారు.

ఇంత అద్భుతమైన అరుణాచలుని భౌతిక రూపము చూడాలని పించడం లేదా! తప్పక రండి అరుణాచలుని దివ్య మంగళ రూపాన్ని చూచి ధన్యులు కండి.

## 8. గిరి ప్రదక్షిణ మహిమ

ఆదిశంకరుడు అరుణాచల సహస్రనామావళిని వ్రాశాడు. ఆపేర్లలో "గిరిప్రదక్షిణ ప్రియాయ" అనే నామమొకటి. అరుణాచలుడు గిరి ప్రదక్షిణ ప్రియుడు అనుటలో సత్యమున్నది. ఎందుకంటే ఆ సర్వేశ్వరునకు గిరి ప్రదక్షిణ మహా ఇష్టము. అందుకే ఆయన కూడా తన అర్ధాంగియైన ఉమాదేవితో కలసి సంవత్సరానికి రెండు మారులు గిరి ప్రదక్షిణ చేస్తాడు ఆదేవదేవుడు గిరి ప్రదక్షిణ చేసేవారిని చూసి సంతోషిస్తాడు. వరాల జల్లు కురిపిస్తాడు. గిరిప్రదక్షిణ అంటే కొండ చుట్టూ తిరుగడము. దీని దూరము సుమారు 14 కి.మీ ఉంటుంది.

గిరిప్రదక్షిణ మహిమను గూర్చి మన పురాణాలు ఈ విధంగా వివరించాయి. ఒక మారు గౌరీదేవి గౌతమమహామునిని ఇలా అడిగినది. "ఓ మహామునీ! ఈ అరుణాచల ప్రదక్షిణ యందలి మహత్తు ఎట్టిది? ఎప్పుడు చేయాలి? ఎలా చేయాలి? ఎట్టి పుణ్యము లభిస్తుందో చెప్పండి" అని. అందుకు గౌతముడు సంతసించి పరమేశ్వరుని ధ్యానించి ఆయన తనకు అరుణాచల గిరి ప్రదక్షిణ మహాత్యమును ఈవిధంగా వివరించాడని పార్వతితో చెబుతున్నాడు. "ఓ గౌతమా! నేను భూలోకములో అరుణాచల రూపముతో వెలసియున్నాను. అందుచేత దేవతలు, మునులు అందరూ నాకు ప్రదక్షిణలు చేస్తుంటారు. నా చుట్టూ వేసే ప్రతి అడుగునకు వారి వారి పూర్వ జన్మలందలి పాపములు నశిస్తాయి. అనేక పుణ్య తీర్థాలలో క్రుంకులిడిన పుణ్యఫలము ఈ గిరిప్రదక్షిణతో లభిస్తుంది. ఏకొంచెము పుణ్యము కూడా చేయని కడు పాపాత్ముడు సైతము నా చుట్టూ తిరుగుట వలన అనేక శక్తులను పొందగలడు తీర్థాల క్రుంకులిడుట, క్షేత్రాల దర్శించుట, గొప్పత్యాగాలు చేయుట, సమస్త శాస్త్రాలు చదువుట, ధర్మార్థములనెడి చతుర్విధ పురుషార్థములను పాటించుట మున్నగు వాటివలన కలిగే పుణ్యఫలమంతా కేవలం ఒక్క శోణాచల ప్రదక్షిణతో సులభంగా సమకూరుతుంది.

ఒక్క అడుగుతో భూలోక ప్రాప్తి, రెండవ అడుగుతో మధ్యలోక ప్రాప్తి, మూడవ అడుగుతో దేవలోక ప్రాప్తి కలుగును. అంతేకాదు, మొదటి అడుగువలనే మానసిక పాపములు తొలగను. రెండవ అడువలన వాచిక పాపముతొలగును. మూడవ అడుగుచేత శారీరక పాపములు నశించును.

నాయీ అరుణాచలము చుట్టూ మునుల మరియు సిద్ధపురుషుల ఆశ్రమాలు వేలకొలది వున్నాయి. దేవతల నివాసాలున్నాయి. నేను సిద్ధస్వరూపముతో ఈ అరుణాచలములో వుంటూ వారి పూజలను గైకొనుచున్నాను. ఈ అరుణాద్రి నిజంగా తేజోవంతమైన జ్యోతిస్తంభము. అందుచే ఈ తేజోలింగాన్ని మనసున ధ్యానిస్తూ మెల్లిగా ప్రదక్షిణ చేయాలి.

ఈ విధంగా ప్రదక్షిణ చేసినట్లయితే వారి జన్మజన్మల పాపాలన్నీ నాశనము కాగలవు వారికిక మరలా జన్మయంటూ వుండదు. అరుణాచలములో ఒకరైన పోగలరు.

గిరిప్రదక్షిణను నిండు చూలాలు గల వనిత నడచే విధంగా, నిదానంగా, జాగ్రత్తగా, నిశ్శబ్దంగా చేయాలి. ప్రదక్షిణకు ముందుస్నానము చేయాలి. విభూతి నుదుట ధరించాలి. శుభ్రమైన వస్త్రాలు ధరించాలి. మెడలో రుద్రాక్షమాలలు వేసుకోవాలి. ఇక శివ స్మరణతో అనగా "అరుణాచల శివ" అంటూ గిరిప్రదక్షిణ చేయాలి. ఈవిధంగా ప్రదక్షిణ చేసేవారి వెంట కనిపించని వారగు వేలాది మునులు, దేవతలు, సిద్ధపురుషులు వస్తుంటారు. కేవలం అరుణాచలుని స్మరణ తప్ప ఇతరమైన తలంపులకు చోటివ్వరాదు అందుచే వివేకవంతుడైన భక్తుడు గుంపును వదలి ఒక్కడై ఆగిరిని మహాశక్తి స్వరూపంగా ధ్యానిస్తూ ప్రదక్షిణ చేయాలి ఐతే, శివుని పవిత్రనామావళిని పాడుతూ, ఆడుతూ పోయే భక్తుల గుంపులో కలసి పోవచ్చును. హృదయము శివస్మరణ కలిగి దారి వెంట దానధర్మాలు చేస్తూ పోవుట శ్రేష్టమైనది.

ఈ కొండ చుట్టూ అంగప్రదక్షిణ చేసినవారు దైవిక శక్తిని పొందగలరు. వారి శరీరం వజ్రకాయంగా మారును. ప్రతి దినము దేవతలు గిరిప్రదక్షిణ చేస్తారు. సూర్యుడు మరియు చంద్రుడు మున్నగు దేవతాశరీరాలు నా చుట్టూ ప్రదక్షిణ చేసి ఇతర గ్రహాలపై ఆధిపత్యాన్ని సంపాదిస్తున్నారు.

ఆదివారము ప్రదక్షిణ చేస్తే సూర్యలోకాన్ని భేధించి శివ సాయుజ్యాన్ని పొందవచ్చు. సోమవారం ప్రదక్షిణ చేస్తే జరామరణ బాధల నుండి తప్పించు కొనవచ్చును. మంగళవారము ప్రదక్షిణ చేస్తే అప్పుల బాధలు తొలగి తిరుగులేని చక్రవర్తియగును. బుధవారము ప్రదక్షిణ చేస్తే మహాపండితుడగును. శుక్రవారము ప్రదక్షిణ చేస్తే సకల సంపదలతో తులతూగి విష్ణులోకాన్నిచేరును. శనివారం ప్రదక్షిణ చేస్తే ప్రాపంచిక విజయాలు లభించును. అంతేకాదు తన జాతకములో దాగియున్న

శని బాధలు తొలిగిపోవును. ఇక శారీరక, మానసిక రోగాలతో బాధపడేవారు, అతి బలహీనులు ప్రదక్షిణ చేస్తే వారి బాధలు తొలగి సుఖపడగలరు.

ఉత్తరాయణ పుణ్యకాలమందు నాతేజోస్వరూపమైన ఈ అరుణాచలమునకు ప్రదక్షిణ చేస్తాను. ఇది కేవలం ప్రపంచ శ్రేయస్సుకే అంతెందుకు పార్వతి కూడా ఇక్కడకు వచ్చి తపస్సు చేస్తుంది. కార్తీక మాసాన కృత్తికా నక్షత్రము నాడు ప్రదోష సమయాన గిరిప్రదక్షిణ చేస్తుంది. ఆ పుణ్యఫలముతో భూలోకములో అపీతకుచాంబగా నిలిచిపోతుంది. తరువాత నాలో ఐక్యమౌతుంది.

గిరిప్రదక్షిణ సమయాన ఏ విధమైన సాధనలను వాడరాదు. కడకు పాదరక్షలను కూడా ఉపయోగించరాదు. అట్లు వాడుట ధర్మవిరుద్ధము ఒకప్పుడు ధర్మకేతు అనే రాజు గుర్రమునెక్కి గిరి ప్రదక్షిణ చేశాడు. దీనిచే అతని గుర్రము గణనాధుడు అయింది. దేవతలు తన్ను స్తుతిస్తుండగా రాజును వదలి శివసాయుజ్యాన్ని పొందింది ఇదంతా చూచి ధర్మకేతు తన తప్పిదాన్ని తెలుసుకొని ఏ ఇతర సాధనలు లేకుండా ప్రదక్షిణ చేసి గణాలలో ఒకడై శివలోకాన్ని, చేరుకొన్నాడు. అప్పటి నుండి ఇంద్రుడు, ముప్పది మూడు కోట్ల దేవతలు మరియు విష్ణువు కేవలం పాదాలతోనే ప్రదక్షిణలు చేస్తారు.

అరుణాచలమునకు ప్రదక్షిణ చేసే సమయాన పాధాలనుండి రక్తము స్రవిస్తే దేవేంద్రుని శిరముపై యుండే మందరపుష్పాలు వచ్చి పరిచర్యలు చేయగలవు గిరిప్రదక్షిణ సమయాన గాయపడినట్లయితే లక్ష్మీదేవి శరీరమందలి కుంకుమ వచ్చి మెత్తగా పరిచర్యలు చేయగలదు.

నాస్వరూపమైన అరుణాచలము అనంతమైన శక్తి కలిగి కరుణా సముద్రమై తేజోవంతంగా ప్రకాశిస్తూ వున్నది. దీని మహిమ ఊహకు అందనిది ప్రదక్షిణ మాత్రాననే సర్వులు సుఖశాంతులను పొందగలరు". "ఈ విధంగా గౌతముడు అరుణాచల ప్రదక్షిణ మహిమను పార్వతికి వినిపించాడు.

భగవాన్ శ్రీరమణ మహర్షులు కూడా గిరిప్రదక్షిణ మహిమను భక్తులకు పదేపదే చెప్పేవారు. ఆయన కూడా గరిప్రదక్షిణకు అధిక ప్రాధాన్యతను ఇచ్చారు. తాను తిరువణ్ణామలైకి వచ్చినప్పటి నుండి 1926 వరకు సంవత్సరములో అనేక మారులు భక్తులతో కలసి గరిప్రదక్షిణలు చేశారు. రమణుల కిది ఏమంత పెద్ద ప్రయోజనము లేకపోయినా రాబోయే భక్తతరానికి తాను ఆదర్శంగా ఉండటం కోసము మరియు గిరిప్రదక్షిణ యందు చక్కని అభిప్రాయాన్ని వారిలో ఏర్పాటు చేయడం కోసము భగవాన్ ఆవిధంగా ఆచరించారు. కానీ, అరుణాచలుని అనుగ్రహము అక్కడకు రాక మునుపే భగవానుకు లభించింది. తనకడకు వచ్చిన ప్రతిభక్తున్ని, "గిరిప్రదక్షిణకు వెళ్ళారా?" అని ప్రత్యేకంగా అడిగేవారు. వచ్చిన వారందరకు గిరిప్రదక్షిణ మహిమను పురాణ సమ్మతంగా వివరించేవారు. నిజంగా చెప్పాలంటే భగవాన్ వలనే గిరిప్రదక్షిణకు గొప్ప ప్రాధాన్యత భక్తులలో కలిగిందని చెప్పవచ్చును. ఇది నేడు అంతటా అందరకు తెలిసిపోయింది.

ఒకమారు "ప్రదక్షిణ" అనే పదములోని పరమార్థాన్ని అరుణాచల పురాణమును ఆధారంగా ఇలా భక్తులకు వివరించారు. "ప్రదక్షిణ అనే పదములో గొప్ప పరమార్థమున్నది ప్రతి అక్షరము ఒక విశిష్టమైన అర్థాన్ని తెలియజేస్తుంది. 'ప్ర' అక్షరము సర్వపాపనాశనాన్ని సూచిస్తుంది. 'ద' కోర్కెలను తీర్చే తత్వాన్ని తెలియజేస్తుంది. 'క్షి' జన్మరాహిత్యాన్ని ఎరుకపరుస్తుంది. 'ణ' జ్ఞానస్వరూపాన్ని తెలియజేస్తుంది." అని అంటే గిరిప్రదక్షిణతో పాపాలు నశిస్తాయి. సమస్త కోర్కెలు నెరవేరుతాయి. జ్ఞానతత్వం తెలియ వస్తుంది. మరియు జన్మరాహిత్యం లభిస్తుందని తెలసుకోవాలి.

ఒకమారు భక్తుడు భగవాన్ను ఈ విధంగా ప్రశ్నించాడు, "ఇక్కడుండే భక్తులు చాలా మంది గిరిప్రదక్షిణ చేస్తుంటారు. అందులోని గొప్పదనమేమి?" అని. భగవాన్ ఈ విధంగా చెప్పారు. "పార్వతీదేవి నిష్కారణంగా లోకాలకు కష్టాన్ని కలిగించింది. ఆ పాపపరిహారార్థము

అరుణాచలానికి వచ్చి తపస్సు చేసింది. పాపాన్ని పోగొట్టు కొన్నది. గిరిప్రదక్షిణ చేసింది. ఆ పుణ్య ఫలముతో అరుణాచలేశ్వరుని చెంత అపీతకు-చాంబగా నిలిచిపోయింది. కార్తీక మాసంలో కృత్తికా నక్షత్రమునాడు ప్రదోషసమయాన ప్రదక్షిణ చేసి అరుణాచలునిలోనే ఐక్యమైపోయింది. ఇంతకంటే ఏమికావాలి? చెప్పండి. గిరిప్రదక్షిణవలన సులభంగా శివసాయుజ్యము లభిస్తుంది."

ఇంతేగాక గిరిప్రదక్షిణ మహిమను భగవాన్ చక్కని ఉదాహరణ కథలను భక్తులకు ఇలా వినిపించేవారు. "ఒకమారు పార్వతీ పరమేశ్వరులు తమ కుమారులైన గణేశ స్కంధులతో కైలాసమున దేవతలు సేవింపగా కొలువు తీరియున్నారు. ఇంతలో నందన అనే గంధర్వుడు పండును తెచ్చి పరమశివునకిచ్చాడు. పిల్లలైన గణేశ స్కంధులు అది చూశారు ఇద్దరూ ఆ పండుకావాలని పట్టుబట్టారు. అప్పుడు వారి తండ్రి అంటాడు, "ఎవరైతే ప్రపంచానంతా చుట్టుకొని ముందుగా నావద్దకు వస్తారో వారికి పండునిస్తాను" అన్నాడు. ఈ మాటలు విని వెంటనే స్కంధుడు ప్రపంచాన్ని చుట్టివచ్చుటకు వెళ్ళాడు. ఐతే వినాయకుడు మాత్రము అరుణాచలానికి ప్రదక్షిణ చేసి స్కంధుని కంటే ముందుగా వచ్చి తండ్రి చెంత నిలచాడు. అంత పరమేశ్వరుడు అతని విజ్ఞతకు మేధాసంపత్తికి మెచ్చి పండునిచ్చాడు. అంతేగాదు. ఈ ప్రదక్షిణ మహిమతో భక్తుల కోర్కెలను తీర్చే శక్తిని నీవు పొందగలవు అని వరమును కూడా ప్రసాదించాడు.

ఒక్కొక్క మారు భగవాన్ పురాణాలలోని వజ్రగండ పాండ్యరాజు వృత్తాంతమును భక్తులను వినిపించేవారు. "వజ్రగండ పాండ్యరాజు ధర్మాత్ముడు మరియు గొప్ప శివ భక్తుడు. శత్రవులను జయించి ఆసేతుహిమాచలమువరకు పాలించాడు. ఒకమారు ఆ రాజు వేటకోసం గుర్రమెక్కి అరుణాచలమందలి అరణ్యములోకి వచ్చాడు అందొక అందమైన ఆడవిపిల్లిని చూశాడు. దాన్ని పట్టుకోవడానికి వెంటబడ్డాడు. ఆ పిల్లి అరుణాచలము చుట్టూ తప్పించుకొనుటకు తిరిగింది. దాని

వెంట రాజు కూడా గుఱ్ఱమెక్కి తిరిగాడు. ఉన్నట్లుండి గుఱ్ఱము మాయమయింది. రాజు క్రిందపడిపోయాడు. పిల్లి కూడా లేదు ఇంతలో పిల్లి మరియు గుఱ్ఱము దేవతాశరీరాలతో ఆకాశమందు అతనికి కనిపించారు. రాజు మెల్లగా లేచి ఆశ్చర్యంతో వారిని చూస్తూవుండిపోయాడు. అంత వారు రాజుతో, "ఓ రాజా! నీ గుఱ్ఱము మరియు మార్జాలము ఎక్కడుకు పోలేదు. అరుణాచలుని ప్రదక్షిణతో మా శాపములు తొలగి మా దేవతా స్వరూపాలు మాకు వచ్చాయి" అని చెప్పారు. అప్పుడు రాజు, "మీరెవరు? ఇదంతా ఎలా జరిగింది? దయచేసి చెప్పండి" అని ప్రార్థించాడు. అప్పుడు కలందరుడు ఇలా చెబుతున్నాడు, 'ఓ రాజా! పూర్వజన్మలో మేము కలంధర మరియు కాంతి శాలి అను పేరుగల విద్యాధరులము. దుర్వాసముని తపము చేసే మేరుపర్వతానికి హోమద్రవ్యాలకోసం మేము పోయాము. అందలి పుష్పాల సౌరభానికి కాంతి శాలి తన్మయుడయ్యాడు. నేను ఆ పూల శోభను చూచి కోయడానికి ఉపక్రమించాను. ఇంతలో సమీపమందలి దుర్వాసముని చూచి కోపించి మేము చేసిన పనులను బట్టి నన్ను జనులను మోసే గుఱ్ఱముగాను, కాంతిశాలిని అడవి పిల్లిగాను అగునట్లు శపించాడు. మా తప్పులను క్షమింపుమని ప్రార్థింపగా ఆయన కరుణించి, "నా శాపము తిరుగులేనిది. ఐతే అరుణాచలుని ప్రదక్షిణతో మాత్రం మీ శాపము తొలగిపోతుంది. ఇందుకు ఆయనే సమర్థుడు" అని చెప్పారు. నేను మీకు గుఱ్ఱముగాను, కాంతిశాలి అడవి పిల్లిగాను జన్మించాము. అదృష్టవశాత్తు మీ వేటవలన మేమిరువురము అరుణాచలుని చుట్టూ పాదాలతో తిరిగే ప్రాప్తము కలిగింది. దాని మూలాన మేము శాపవిముక్తుల మయ్యాము. నీవు కూడా ప్రదక్షిణ చేశావు కానీ అది గుఱ్ఱము నెక్కి. అందుచే నీకు పుణ్యము లభింపలేదు కావున నీవు పాదములతో అరుణాచలునకు ప్రదక్షిణ సల్పిమావలె కోరికలను తీర్చుకో" అని చెప్పివారు తమలోకానికి వెళ్ళిపోయారు. తరువాత వజ్రగండ పాండ్యుడు వైరాగ్యముపొంది, రాజ్యమును, కొడుకునకు అప్పగించి అరుణాచలానికి వచ్చి పుణ్యకార్యాలు చేస్తూ గిరిప్రదక్షిణలు సల్పి

అరుణాచలుని కృపకు పాత్రుడై తరించాడు" కాబట్టి గిరిప్రదక్షిణతో ఎవరైనా తరింపవచ్చును అని భగవాన్ చెప్పేవారు.

ఒకమారు భగవాన్ భక్తుడగు మురగనార్, "గిరిప్రదక్షిణవలన ఆధ్యాత్మిక ప్రయోజనము ఏమైనా లభిస్తుందా? సెలవియ్యండి" అని ప్రార్థించాడు. అందుకు భగవాన్, "మీరు మొదట గిరిప్రదక్షిణకు పోయిరండి. తరువాత ప్రాధాన్యతను తెలుసుకొందాము," అన్నారు. మురగనార్ భగవాన్ చెప్పిన ప్రకారము గిరిప్రదక్షిణ చేసి ఆనందాన్ని అనుభవించారు. "ఇప్పుడు తెలిసిందా? గిరిప్రదక్షిణలో వుండే మహోన్నతమైన ఆధ్యాత్మిక స్థితి! గిరిప్రదక్షిణ సమయములో ఆధ్యాత్మిక జ్ఞానము కావాలనుకొనే వారికి అరుణాచలుడు, "సంచారసమాధిని" ప్రసాదిస్తాడు. గిరిప్రదక్షిణ చేస్తేచాలు ఎవరికి ఏదికావాలో దానిని ప్రసాదించుటకు అరుణాచలుడు సిద్ధంగా వున్నాడు. "కరుణాపూర్ణ సుదాబ్ధి అరుణాచలుడు" అని వివరించాడు.

భగవాన్ రమణులుగిరి ప్రదక్షిణ మహిమను పురాణాల సమ్మతంగా వాటికి తన అనుభవాలను జోడించి రమ్యంగా వివరించి చెప్పేవారు. ఇక మనము గిరిప్రదక్షిణను సల్పి, అరుణాచలుని కృపకు పాత్రులమై ధన్యులమౌదాం!

## స్కాందపురాణ మందలి ప్రదక్షిణ నియమావళి

అపన్నప్రసవా నారీ యధాగచ్ఛే దనాకులం
తథా ప్రదక్షిణ కుర్యా దశృణ్యంశ్చ పదధ్వనిం
స్నాతో విశుద్ధవేష స్సన్భస్మ రుద్రాక్షభూషితః
శివస్మరణ సంతుష్టో మందం దద్యాత్పదం బుధః

భావము : స్నాము చేసి, శుభ్రమైన వస్త్రముల ధరించి, నుదుట విభూతి మరియు కంఠమందు రుద్రాక్షమాలల ధరించి, ప్రసవ కాలము సమీపించిన స్త్రీ శీఘ్రము మాని మెల్లగా నడచే విధంగా పాదముల శబ్దము కూడా యితరులకు వినిపించకుండా నిశ్శబ్దంగామనసున

శివస్మరణం చేస్తూ మెల్లగా ప్రదక్షిణ చేయాలి.

## 9. నేటి గిరిప్రదక్షిణ దారి వర్ణన

అరుణాచల గిరి చుట్టూ తిరగడాన్ని "గిరిప్రదక్షిణ" అంటారు ఈనాడు భక్తులు సుఖంగా గిరిప్రదక్షిణ చేయడానికి అనువుగా దారంతా తారురోడ్డు వేయబడియున్నది. దారికి ఇరువైపులా నీడనిచ్చే పెద్దపెద్ద చెట్లున్నాయి. రాత్రివేళ ప్రదక్షిణ చేసే భక్తుల కోసం దీపాలు రాత్రంతా వెలుగుతూ వుంటాయి. అందుచే రాత్రిపూట ఏవేళైనా నిర్భయంగా పిల్లాపాపలతో భక్తులు ప్రదక్షిణ చేయవచ్చును. రాత్రివేళ ప్రకాశవంతమైన దీపకాంతులతో, వృక్షాల నడుమ ప్రదక్షిణ చేస్తూ గమనించినట్లయితే మనము అరుణాచలుని గంభీరమైన గుహలోకి పోతున్న అనుభూతిని, ఆనందాన్ని పొందగలము. దారివెంబడి అలసట తీర్చుకొనేందుకు మంటపాలున్నాయి. ఎండ ఎక్కువైతే ఇందులో వుండవచ్చును. వర్షము వస్తే తలదాచుకోవచ్చు. పండుగ సందర్భాలలో యాత్రికులుండటానికి ఇవన్నీ ఎంతో ఉపయోగపడతాయి. ఇక్కడ ముఖ్యంగా చెప్పవలసినవి నందీ విగ్రహాలు వేరువేరు సైజుల్లో వున్నాయి. ప్రతి నందీ అరుణాచలుని వైపు ముఖము కలిగి కొలువుదీరియున్నాయి. దారి వెంబడి కొంత దూరము పోతేచాలు. నంది విగ్రహము ప్రత్యక్షమౌతుంది. నంది అరుణాచలుని ముగ్ధమోహన రూపాన్ని తనివితీరా చూస్తూ నిర్మలంగా పరవశుడై వుంటాడు. ఇక దారివెంబడి అనేక తీర్థాలున్నాయి. ఇవన్నీ అరుణాచలుని సేవించుటకు చుట్టూ కొలువై వున్నట్లు మరియు గొప్పమహిమ కలిగియున్నట్ల మన పురాణాలు చెబుతాయి. ముఖ్యంగా అష్టదిక్కుల్లో అష్ట తీర్థాలు వెలసియున్నాయి. వీటిలో గంగ అంతర్గతంగా వుంటూ అరుణాచలున్ని సేవిస్తూ వుంటుంది. వర్షాకాలములోనైతే గిరి నుండి వచ్చే వర్షపు నీటితో కలసి బహిర్గతమై ఆతీర్థాలు మనకు దర్శనమిస్తాయి. వాటి సేవనము వలన పుణ్యము లభిస్తుంది. దేవతలు ఈ తీర్థాలలో స్నానమాడి తమతమ పాపాలను పోగొట్టుకొన్నట్లు స్కాంద పురాణము, సూతసంహిత, శివభక్త మహత్యము మున్నగు పురాణాలు

చక్కగా వివరించాయి. వీటి సమీపములోనే అష్టదిక్పాలురు తమతమ స్థానాల నుండి అరుణాచలున్ని వేద మంత్రాలతో పూజించుటకు అనువుగా శివలింగాలను ఏర్పాటు చేసి గుడులను కట్టించి యున్నారు. ఇవన్నీ ఒకేవిధమైన పద్ధతిలో కట్టబడి యున్నాయి. ఈ గుడులే కాదు. అరుణాచలునకు సంబంధించిన దేవతాగుడులు గిరిచుట్టూ ఉన్నాయి. ఇవన్నీ బయలు ప్రదేశాలు, పూదోటలు, నీటి సౌకర్యాలు, ప్రాకారాలు మున్నగు వాటితో మనోహరంగా వున్నాయి. తీర్థాలలో నీరు లేదే యని సంకోశపడనవసరములేదు. ప్రతి తీర్థానికి సమీపంలో బోరునీటి సౌకర్యము కలదు. ఆ నీటిని మనము ప్రోక్షించినా, త్రాగినా పుణ్యము లభిస్తుంది. వీటన్నింటిని దర్శిస్తూ "అరుణాచలా!" అంటూ ప్రదక్షిణ సాగిస్తుంటే నిజంగా ఏదో లోకంలో వున్నట్లు అనుభూతిని పొందగలము. అదేదోకాదు అదే శివలోకం. ఇక గిరిప్రదక్షిణ చేస్తూ మార్గము వెంట అరుణాచలున్ని చూస్తూ పరవసిద్దాం పుణ్యాన్ని పొందుదాం.

వేకువజామున అరుణాచలేశ్వర దేవాలయము నుండి గిరిప్రదక్షిణ ప్రారంభిస్తాం. దేవళము బయట నుండే మనప్రభువైన అరుణాచలేశ్వరునకు నమస్కరించి మెయిన్‌బజారు రోడ్డు వెంట కొంత దూరము పోతే ఇంద్రిలింగము వస్తుంది. తూర్పునకు అధిష్ఠానమైన ఇంద్రుడు ఇక్కడ శివలింగాన్ని ఏర్పాటు చేసి పూజించి తన భక్తిని అరుణాచలునకు తెల్పుకొన్నాడు. అందుచేత మనము ఆ ఇంద్రలింగాన్ని మరియు అచ్చటున్న పార్వతీ వినాయకుల విగ్రహాలకు ప్రదక్షిణ చేసి మనము ముందుకు సాగిపోదాము. ఇంద్రలింగ సమీపములోనే ఇంద్రతీర్థముండేది. ఇక్కడ ఇంద్రుడు స్నానమాడి బ్రహ్మ హత్యా పాతకమును పోగొట్టుకొన్నాడు. ఐతే ఈ తీర్థము ఇప్పుడు భూగర్భములో కలసిపోయింది. కానీ గుడి ప్రాంగణములో నీటిసౌకర్యము కలదు. ఈ నీటి సేవనము వలన కూడా పుణ్యము లభిస్తుంది. ఇక మనము కొంత దూరముపోతే అగ్ని తీర్థము వస్తుంది. ఇక్కడ నీరు సాధారణంగా ఎప్పుడూ వుంటుంది. ఇక్కడే అగ్నిదేవుడు స్నానమాడి పరస్త్రీవ్యామోహ పాతకాన్ని పోగొట్టుకొన్నాడు. మన్మధుడు ఇక్కడ స్నానమాడి

అరుణాచలున్ని స్మరించి అతిలోక సుందరుడయ్యాడు. దీనికి ఎదురుగ వినాయకుని మంటపము కలదు. ఈ విఘ్నేశ్వరున్ని దర్శించి ఇక్కడ నుండి అరుణాచలున్ని చూస్తే ఆయన మశీదు ఆకారములో గంభీరంగా దర్శనమిస్తాడు. ఇటునుండి కొంచెము దూరము పోయి సందువెంట కొంచెము పోతే అగ్నిలింగము వస్తుంది. ఆగ్నేయదిశకు అధిపతియైన అగ్నిదేవుడు శివలింగాన్ని ఏర్పాటు చేసి శాస్త్రోచితంగా అరుణాచలున్ని పూజించి వున్నాడు. అగ్నిలింగానికి ప్రదక్షిణ చేసి మరలా రోడ్డుకు వచ్చి కొంచెము పోతే శేషాద్రి స్వామి ఆశ్రమము వస్తుంది. ఈయన అరుణాచల నామాన్ని నిరంతరం జపించి గొప్ప అవధూతయై సమాధియై వున్నాడు. ఆయనకు నమస్కరించి కొంత దూరముపోతే కాళీమాత దేవళము వస్తుంది. ఆమెకు మ్రొక్కులు చెల్లించి బయలు దేరితే దక్షిణామూర్తి విగ్రహము దర్శనమౌతుంది ఆమౌన స్వరూపానికి నమస్కరించి ముందుకు పోతే శ్రీరమణాశ్రమము వస్తుంది. తపోధనుడు, శాంత స్వరూపుడు. మౌనతత్వ బోధకుడైన శ్రీ రమణమహర్షుల సమాధి ఆలయమందు కలదు. ఈయన చిన్ననాడే అరుణాచలుని ప్రేరణతో అరుణాచలానికి వచ్చాడు. ఇచ్చటే తపమును సల్పి కొండలో చాలా కాలముంటూ కడకు భక్తుల సౌకర్యార్ధము శ్రీరమణాశ్రమములో వుండిపోయాడు. ఇక్కడే సమాధి అయ్యాడు. ఈ సమాధి దర్శనభాగ్యము పరమపావనమైనది. అందుచే గిరిప్రదక్షిణ చేసే భక్తులందరూ తప్పక రమణాశ్రమాన్ని దర్శిస్తారు. చెప్పాలంటే ఈ మహర్షియే గిరిప్రదక్షిణ మహిమను జనప్రచాములోనికి తెచ్చాడు. అంతేగాక తాను కూడా గిరిప్రదక్షిణ చేస్తూ భక్తులకు ఆదర్శంగా వుండిపోయాడు. ఇక్కడే ఆయన తల్లియైన ఆళగమ్మ అనగా మాతృభూతేశ్వరాలయము కలదు. తల్లిని పవిత్రురాలిని చేసి ముక్తినొసంగి, సమాధిచేసి, ఆలయాన్ని కట్టించి పూజలు చేయించిన పుణ్యాత్ముడు కలియుగములో శ్రీ రమణమహర్షి లొక్కరేయని చెప్పవచ్చును. ఇక్కడ ఆయనచే స్వయంగా ఏర్పాటుచేసిన శ్రీచక్రవిగ్రహము కూడా వున్నది. వీటి నన్నింటిని చూచి బయటకు వచ్చి అరుణాచలుని చూస్తే ఆయన మనోహరంగా దర్శనమిస్తాడు. ఆ

మోహన రూపాన్ని చూస్తూ శ్రీరమణాశ్రమం మెయిన్‌గేటు దాటిపోతే పాలితీర్థమువస్తుంది. దానికి ఎదురుగా వినాయకుని చిన్న గుడి ఆయనకు నమస్కరించి పోతే పలాకొత్తు ప్రాంతము కుడివైపున ఉంటుంది. అక్కడ అగస్త్యతీర్థమున్నది. అక్కడే అగస్త్యుడు తన శిష్యగణముతో వచ్చి స్నానమాడి అరుణాచలుని సేవించాడు. అంతేగాక దాని ఒడ్డున వినాయకువిగ్రహము ఏర్పాటుచేసి పూజించియున్నాడు. అందుకే ఈ వినాయకునకు అగస్త్య వినాయకుడు అను పేరు వచ్చింది. ఇక్కడున్న అగస్త్య తీర్థములో స్నానమాడి వినాయకున్ని పూజించి అరుణాచలునకు మ్రొక్కులు చెల్లిస్తే గొప్ప భాషాజ్ఞానము లభిస్తుందని ప్రతీతి ఇదంతా చూచి తిరిగి మెయిన్‌రోడ్డుకు వచ్చి కొంతదూరముపోతే సుబ్రహ్మణ్య స్వామి దేవాలయము వస్తుంది. అందు స్కంధుడు తన తండ్రియైన అరుణాచలున్ని చూస్తూ భక్తుల కోర్కెలను మన్నిస్తూ కొలువైయున్నాడు. ఈయనకు నమస్కరించి బయటకు వచ్చి చూస్తే ఎదురుగా సింహతీర్థము కనిపిస్తుంది. ఈతీర్థము ముఖద్వారము సింహపు బొమ్మతో వెలసింది. అందుచే దీనికి సింహ తీర్థమను పేరు వచ్చింది. (వర్షాకాలములో అరుణాచలుని అభిషేకపు నీరంతా అక్కడ నిలువై వుంటుంది. అందుచే ఈ గంగ పవిత్రమైనది. ఇందులో స్నానమాడి అరుణాచలున్ని మరియు అక్కడుండే స్కంధున్ని సేవిస్తే సమస్తరోగాలు తొలగిపోతాయని వాడుక)

ఇక కొంచెంము ముందుకు పోతే యమలింగము వస్తుంది. దక్షిణదిశాపాలకుడైన యముడు శివలింగాన్ని ప్రతిష్టించి పూజలు చేసి అరుణాచలుని పై తనకున్న భక్తిని ప్రకటించుకొన్నాడు. ఈ లింగానికి, నమస్కరించి ప్రక్కనే వున్న యమతీర్థాన్ని చూడవచ్చు ఈ తీర్థములో యముడు స్నానమాచరించి బ్రహ్మాస్త్రము వలన భయాన్ని పోగొట్టుకొన్నాడు. ఇక్కడ నుండి కొంచెము ముందుకు పోతే నందివిగ్రహము ప్రత్యక్షమౌతుంది. ఆ నంది అరుణాచలున్ని తదేకంగా చూస్తూ ఉన్నది. అక్కడ నుండి మనము కొండవైపు చూస్తే అక్కడ కూడా పెద్దనంది విగ్రహము కనిపిస్తుంది. అది మెడచాచి ప్రదక్షిణ చేసే భక్తులను చూస్తూ అభయమిస్తున్నట్లు కనిపిస్తుంది. ఆ మనోహర

దృశ్యాన్ని చూస్తూ ముందుకు పోతే మార్కండేయుని గుడి వస్తుంది. మార్కండేయుడు అరుణాచలుని అర్చించుట కొరకు తన ఇష్టదైవమైన శివలింగాన్ని ప్రతిష్టించి ఆరాధించి వున్నాడు. ఈ లింగానికి ప్రణామములు సమర్పించి కొంచెము దూరము పోతే గిరి ప్రదక్షిణకు టర్ను అయ్యేరోడ్డు వస్తుంది.

ఇక్కడ నుండి అరుణాచలని గమనిస్తే ఆయన శ్రీచక్రరూపంలో దర్శనమిస్తాడు. అంతేగాక గంభీరమైన గజాననుని రూపం కూడా అందు కనిపిస్తుంది. అక్కడ అరుణాచలునకు కర్పూరహారతులు సమర్పించి మనకోర్కెలను ఆ శ్రీచక్రరూపునకు విన్నవించుకోవచ్చును. శక్తి స్వరూపుడైన అరుణాచలుడు భక్తుల కోర్కెలను తప్పక మన్నించగలడు. ఇక అక్కడున్న వినాయకునకు నమస్కరించి ప్రదక్షిణ చేస్తూ పోతే దుర్వాసముని గుడి వస్తుంది. ఇక్కడ ఈమునీశ్వరుడు వుంటూ అరుణాచలుని ఆరాధించాడు. శాంతిని పొందాడు. అక్కడ మనము కూడా దుర్వాసమునికి ప్రదక్షిణ చేసి అరుణాచలునకు నమస్కరిస్తే కోపము పోయి శాంతము లభిస్తుంది. ఇక ముందుకు పోతే గణేశ్ గుడి వస్తుంది. దాని ప్రక్కనే శోణతీర్థమున్నది. అంతేకాదు ఇక్కడ ఇంకా చిన్నచిన్న గుడులున్నవి. వాటిని దర్శిస్తూ పోతే నైరుతి దిశలో నిరుద్దిలింగము కనిపిస్తుంది. నైరుతి దిశకు అధిష్టానుడైన నిరుద్ది ఇక్కడ శివలింగమును ఏర్పాటు చేసి పూజించి అరుణాచలునకు భక్తిని ప్రకటించుకొన్నాడు. ఇక్కడ నుండి కొండవైపు చూస్తే అరుణాచలుడు ప్రశాంతవదనుడై మనలను ఆశీర్వదిస్తున్నట్లు కనిపిస్తాడు. ఈ గుడి ప్రక్కననే నిరుద్ది తీర్థమున్నది. ఇందు నిరుద్ది మరియు ఋషులు స్నానమాడి భూతపిశాచాలను జయించి వశపరచుకొన్నారు. ఇక్కడ స్నానము చేసి అరుణాచలుని పూజించిన వారికి భూతపిశాచ సంబంధమైన పీడలు తొలగిపోతాయి. ఇదంతా చూస్తూ ముందుకు పోతే జగన్మాతా పితలైన అణ్ణామలైయార్ మరియు ఉణ్ణామలై అమ్మ దర్శనమిస్తారు. ఈ విగ్రహాలు చూడముచ్చటగా వుంటాయి. వీరికి నమస్కరించి గిరివైపు చూస్తే అక్కడ కూడా అరుణాచలుడు పార్వతీ

సమేతంగా దర్శనమిస్తాడు. పార్వతీ పరమేశ్వరుల రెండు గుడుల వెనుక వారిరువురకు సంబంధించి పెద్ద తీర్థమున్నది. ఇందులో స్నానమాడి శివపార్వతులను పూంజించినట్లయితే సంతానప్రాప్తి కలుగుతుందని ప్రతీతి.

ఇక్కడు నుండి కొంచెము ముందుకు పోతే హనుమాన్ గుడి వస్తుంది. ఆరామభక్తునకు నమస్కరించి పోతే సుబ్రమణ్యస్వామి గుడి వస్తుంది. తన తల్లిదండ్రులైన పార్వతీపరమేశ్వరులను చూస్తూ మురిసిపోతున్న కుమారస్వామికి దండములు నమర్పించి ముందుకు పోతే అరుణాచలునిలో ఐక్యమై ప్రకాశించే రాజరాజేశ్వరి మనకు దర్శనమిస్తుంది. ఆమెకు ప్రణామములిడి గిరిని పరిశీలిస్తే అక్కడ గౌరీపర్వతము మత్రమే కనిపిస్తుంది. అరుణాచలుడు కనిపించడు. పార్వతియే అరుణాచలున్ని తనలో లయము చేసుకొన్నదేయనే ఊహ మనకు కలుగుతుంది. అటనుండి ముందుకు పోతే గౌతమాశ్రమము వస్తుంది. అక్కడ గౌతమహాముని కొలువైయున్నాడు. ఇక్కడే గౌతముడు పరమేశ్వరున్ని స్తుతించి, ప్రత్యక్షము చేసుకొని ఆయనవలన అరుణాచల మహాత్యమును, పూజావిధానమును, నామావళిని తెసులుకొన్నాడు. తరువాత ఇక్కడే పార్వతికి అరుణాద్రి మహత్తును తెలిపియున్నాడు. ఈ మునీశ్వరునకు నమస్కరించి పోతే సూర్యలింగము వస్తుంది. సూర్యభగవానుడు శివలింగాన్ని ప్రతిష్ఠించి వేదసమ్మతంగా అర్చించి తన భక్తిని అరుణాచలునకు సమర్పించుకొన్నాడు. ఈగుడి ప్రక్కననే సూర్యతీర్థమున్నది. ఇక్కడే ఆదిత్యుడు స్నానమాడి గ్రహాలపాలకుడయ్యాడు. ఇక్కడ నుండి పోతే వరుణలింగము వస్తుంది. పశ్చిమానికి పాలకుడైన వరుణుడు శివలింగాన్ని స్థాపించి పూజించి తన మ్రొక్కును అరుణాచలునకు చెల్లించుకొన్నాడు. ఇక్కడ వరుణతీర్థమున్నది. వరుణుడు ఇందు స్నానమాఢి ఆపుణ్యఫలముచే సముద్రాలకు రాజయ్యాడు. ఇట నుండి కొంత దూరముపోతే ఆది అణ్ణామలై దేవాలయము వస్తుంది. ఈ దేవాలయ నిర్మాణమంతా ఒకటవ మరియు రెండవ ప్రాకారముతో కూడిన అరుణాచలేశ్వర

దేవాలయమువలె వుంటుంది. అక్కడున్న దేవతలను దర్శించి కొలది దూరము పోతే వాయులింగము వస్తుంది. వాయువ్యదిశకు అధిపతియైన వాయుదేవుడు ఇక్కడ లింగాన్ని ఏర్పాటు చేసి పూజించి అరుణాచలున్ని మెప్పించి వున్నాడు. పూర్వము ఇక్కడ వాయు తీర్థముండేది. కానీ ఇప్పుడు లేదు. ఈ తీర్థమందు వాయుదేవుడుస్నానమాడి జీవులకాధారమైన ప్రాణశక్తిని సంపాదించాడు.

ఇక్కడ నుండి పోతే ఒక మోరీవస్తుంది. అక్కడే భగవాన్ రమణులు గిరిప్రదక్షిణ సమయములో కూర్చొని అరుణాచలుని దివ్యమంగళ రూపాన్ని తదేకంగా చూసేవారు. ఆనందపారవశ్యముతో కన్నీళ్లు రాల్చేవారు. రమణులకు అరుణాచలుని యెడ వుండే అపారమైన భక్తియే ఇందుకు కారణము. అక్కడ నుండి గిరిని మనము చూచినా ఆనందము పరవళ్ళు త్రొక్కుతుంది. అరుణాచలుడు పవళించినట్లు మనకు దర్శనమిస్తాడు. ఆ మోహనరూపాన్ని చూస్తే ఎవరికైన పారవశ్యము కలుగక మానదు. ఇదంతా రమణునికరుణయే అని చెప్పక తప్పదు. మనము కూడా ఆమోరీపై కొంత సేపు కూర్చొని అరుణాచలున్ని మరియు రమణులను స్మరించి ముందుకు సాగిపోదాము. తరువాత కుబేర లింగము వస్తుంది. ఇది ఉత్తరదిశా పాలకుడైన కుమేరుడు స్థాపించి పూజించిన శివలింగము. ఇక్కడ కుబేర తీర్థమున్నది. ఇందు కుబేరుడుస్నానమాడి ధనాధిపతి అయ్యాడు. కుబేరలింగానికి ప్రదక్షిణ చేసి అరుణాలచలుని మనోహర రూపాన్ని చూస్తూ పోతే ముక్తి ద్వారము వస్తుంది. ఈ ద్వారము నుండి ఒకమారు బయటకు వస్తే ఒక జన్మదాటినట్లు భక్తులు భావిస్తారు. ఇంకొంచెము దూరము పోతే పంచలింగాలు దర్శనమిస్తాయి. ఇక్కడకు అరుణాచలుడు చాలా దగ్గరలో వుంటాడు. ఇక్కడనుండి చూస్తే అరుణాచలుడు పంచముఖాలతో దర్శనమిస్తాడు. ఇక అరుణాచలుని పంచముఖస్వరూపానికి మరియు అక్కడ ఏర్పాటు చేయబడిన పంచలింగాలకు ప్రణామములు సమర్పించి కొంత దూరము పోతే వేలూరు రోడ్డు వస్తుంది. దానిని దాటి కొంచెము తూర్పునకు పోతే ఈశాన్యలింగము వస్తుంది. ఈశాన్యమునకు

అధిపతియైన ఈశానుడు లింగాన్ని ప్రతిష్ఠించి పూజించి అరుణాచలున్ని మెప్పించి వున్నాడు. ఈలింగానికి ప్రదక్షిణ చేసి వచ్చి ఎదురుగా చూస్తే ఈశాన్యతీర్థము కనిపిస్తుంది. ఇందు విష్ణువు స్నానమాడి లక్ష్మీదేవిని భార్యగా పొందాడు. ఇక్కడ నుండి కొంచెము పోతే ఈశాన్య జ్ఞానదేశికర్ జీవసమాధికోవెల వస్తుంది. ఈయన అరుణాచలుని ప్రియభక్తుడు. ఈయనకు నమస్కరించి కొంత పోతే పార్వతీపరమేశ్వరులు వృషభవాహనారూఢులై వెలసిన చిన్నగుడి వస్తుంది. గిరిప్రదక్షిణ సుఖంగా సాగిందని వారికి మనవి చేసి టౌనులోనికి ప్రవేశిస్తాము. అక్కడ జనుల సందడి, వాహనాల ధ్వనులు, దుమ్ముధూళి అధికము. ఐతే, ఇదంతా గిరిప్రదక్షణ చేసే భక్తులను ఏమాత్రము కష్టపెట్టజాలరు. ప్రశాంతతకు భంగము కలిగించదు. ఎందుకంటే అరుణాచలుని బాహ్యరూపమంతా అక్కడకు చక్కగా కనిపిస్తూ వుంటుంది. ఆ కరుణామయుని ఆనంద తరంగాలుభక్తులపై ప్రసారమౌతూ వుంటాయి. ఆ ఆనందములో భక్తులు పరవశమై వుంటారు. ఇక దారిలో చూడదగినవి దుర్గమ్మ దేవాలయము మహిషాసురున్ని వధించిన దుర్గాదేవి అక్కడున్న రాతిని ఖడ్గముతో కొట్టి నీటిని పుట్టించినది. మహిషాసురిని వధచే పాపపంకిలమైన ఖడ్గమును ఆగంగలో కడిగి మరియు అందు తాను కూడా స్నానమాడి పవిత్రురాలై తిరిగి పార్వతీదేవిలో ఐక్యమయింది. ఇందుకు సంబంధించిన దంతా అక్కడ వెలసియున్నది. ఆ పవిత్రస్థలమును దర్శించి మెల్లగా పోతే అరుణాచలేశ్వర దేవాలయము వస్తుంది. ఆ దేవాలయములో అడుగుపెట్టగనే గొప్ప అనుభూతి కలుగుతుంది. అరుణాచలుని కరుణ ఆ దేవాలయములో నిండి యున్నదా అనే మహదానందమును పొందగలము. అక్కడున్న దేవతా గుడులను తీర్థాలను భగవాన్ రమణ మహర్షులు తపము చేసిన పాతాళలింగమును దర్శించి ఇంకా ఓపికయున్న ఇతర దేవతా స్థలాలను, దేవతలను చూస్తూ గర్భగుడిలోకి ప్రవేశిద్దాము అక్కడ స్వయంభూలింగమై, తేజోమయమై ప్రకాశించే అరణాచలేశ్వరుని మనసారా దర్శించి శతకోటి వందనాలు తెలుపుకొందాము. తరువాత ప్రక్క గుడిలో వెలసిన అపీతకుచాంబకు

ప్రణామములు సమర్పించి బయట అనగా మూడవ ప్రాకారమందు గల దీపదర్శనమంటపము నుండి మరొక్క మారు అరుణాచల శిఖరానికి మ్రొక్కులు చెల్లించి ఎవరి గమ్యానికి వారు చేరుకుందాము. ఈ విధమైన గిరిప్రదక్షిణ కడు పవిత్రమైనది ఈ ప్రదక్షిణతో అరుణాచలుడు సంతసించి కోరిన వరాల జల్లును కురిపిస్తాడు.

చాలామంది భక్తులు శ్రీరమణాశ్రమము నుండి గిరిప్రదక్షిణను ప్రారంభిస్తారు. ఆభక్తులు తమ గిరిప్రదక్షిణ వ్రతాన్ని శ్రీ రమణ దేవునకు తెలియజేసి ఆయన ఆశీర్వాదమును పొంది వెళ్ళి చివరకు శ్రీరమణాశ్రమానికి వచ్చి భగవాన్ రమణుల సమాధికడ సెలవు తీసుకొని తమ గిరిప్రదక్షిణ ముగిసినట్లు భావిస్తారు. అరుణాచలేశ్వరుడు మరియు భగవాన్ రమణులు ఇద్దరూ ఒక్కరే. అరుణాచలేశ్వరుడే రమణుడు రమణుడే అరుణాచలేశ్వరుడు.

ఇదంతా చదివి తెలుసుకొన్న తరువాత గిరిప్రదక్షిణ చేయాలనే సదాశయము కలగడం లేదా? తప్పక ఆశ కలుగుతుంది. అరుణాచలానికి రండి. గిరిప్రదక్షిణ చేసి అరుణాచలుని కృపను మరియు భగవాన్ రమణుల దయను పొందండి. ధన్యులు కండి.

## 10. అరుణాచలక్షేత్ర విశిష్టత - దీపోత్సవ మహిమ

ప్రపంచములో వెలసిన యాత్రాక్షేత్రాలలో అరుణాచలము అతిప్రాచీనమైనదిగాను, అతి పవిత్రమైనదిగాను ప్రసిద్ధిగాంచింది. అక్కడున్న అరుణాచలము శివలింగాకారముతో మనోజ్ఞంగా ప్రకాశిస్తూ వుంటుంది. స్మరించినంతనే భవ బంధాలను త్రెంచి ముక్తిని ప్రసాదించే కరుణాఘననగము ఈ అరుణాచలము.

బ్రహ్మవిష్ణువుల తగవు తీర్చుటకు విశ్వవ్యాపకమైన పరమేశ్వరుడు వారి మధ్య జ్యోతిస్స్తంభముగా ఇక్కడే అవతరించాడు. తరువాత సమస్తలోకాలను ఉద్ధరించుటకు అరుణాచలంగా ఆవిర్భవించాడు. దేవతల చేతను, మునుల చేతను, జనుల చేతను వేదోచితమైన భగవాన్

పూజలుగైకొంటూ వారి కోర్కెలను తీర్చుటకు అరుణాచలేశ్వరుడుగా అవతరించాడు. ఇక మౌనము ద్వారా తత్త్వజ్ఞానము ప్రసాదించుటకు మానవరూపధారియై అరుణగిరి యోగిగా కొండయందు ఒక వటవృక్షము క్రింద దక్షిణాభిముఖుడై వెలయుచున్నాడు. అందుచే ఈ క్షేత్రము సాక్షాత్తు శివస్వరూపము. ఈ క్షేత్రమందు శివస్వరూపము తాండవిస్తూవున్నది.

ఇక్కడే పార్వతి ప్రపంచశ్రేయస్సు కోసము తపమాచరించింది అరణాచలున్ని మెప్పించి తన తనయుల కోసం అపీతకుచాంబగా ఈ క్షేత్రమందు నిలచిపోయింది. కార్తీక దీపోత్సవము నాడు గిరిప్రదక్షిణ చేసి అరుణాచలునిలో ఐక్యమయింది. అందుకే ఈ అరుణాచలము శక్తినీ, ముక్తినీ ప్రసాదించు పుణ్యనగముగా వర్ధిల్లుతూ వున్నది. ఇక్కడే గౌరి మహిషాసురున్ని వధించి ఖడ్గముతో తీర్థమును పుట్టించి, అందు ఖడ్గమును కడిగి పాపము తొలగించి, తాను కూడా అందు స్నానమాడి పవిత్రురాలై అరుణాచలుని మెప్పించి దుర్గాదేవిగా అక్కడ నిలిచిపోయింది. ఈమె సన్నిధిలో మంత్రఫలము త్వరగా సిద్ధించును. ఖడ్గతీర్థములో ఒకమారు స్నానము చేస్తే చాలు సమస్త రోగాలు, పాపాలు తొలగిపోతాయి. ఇంత పవిత్రమైన క్షేత్రము ఈ అరుణాచలము.

అరుణాచలుని స్మరణ కడు పవిత్రమైనది. ఎందుకంటే అరూరులో జన్మించినవారు, కాశిలో మరణించినవారు, చిదంబరాన్ని దర్శించినవారు, అరుణాచలుని స్మరించినవారు. మోక్షానికి అర్హులని మన పురాణాలు చెబుతున్నాయి. అందుచే ఈ క్షేత్రానికి వచ్చి "అరుణాచలా" అంటే ముక్తి లభిస్తుంది. ఇది పరమేశ్వరుని నిర్ణయము. అందుచే ఈ అరుణాచలక్షేత్రము ముక్తిని ప్రసాదించే పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధిగాచింది.

ఈ క్షేత్రానికి అధిక ప్రాధాన్యతను, పవిత్రతను తెచ్చిపెట్టినది, "దీపోత్సవము" అని చెప్పవచ్చును. కార్తీకమాసంలో భరణీ మరియు కృత్తికానక్షత్రములు ఒకేరోజున దర్శనమిచ్చు పౌర్ణమినాటి ప్రదోషసమయాన ఈ దీపోత్సవము వైభవంగా జరుగుతుంది. దీనినే "కార్తీకదీపోత్సవము" అంటారు. ఈ క్షేత్రమందు జరిగే పండుగలలో

కార్తీక దీపోత్సవపు పండుగ మిక్కిలి ప్రధానమైన పండుగ. ఈ దీపోత్సవ ప్రాధాన్యతను గూర్చి మన పురాణాలు ఈ విధంగా వివరించాయి.

ఒకమారు పార్వతీదేవి గౌతమమునిని కార్తీకదీపోత్సవ ప్రాధ్యానతను వివరింపుడని కోరింది. అందుకు గౌతముడు ఈ విధంగా చెప్పాడు "ఓ గౌరీదేవీ! దీపోత్సవదర్శనము కడు పవిత్రమైనది. ఈ దీపదర్శనముచే సమస్తపాపాలు తొలగి పోవును సుఖాశాంతులతో జీవించగలరు. చివరకు మోక్షానికి అర్హులగుదురు.. అంతే గాదు. ఈ దీపోత్సవమునాడు. గిరిప్రదక్షిణ చేస్తేచాలు భవబాధలు తొలగిపోవును సాధారణంగా చేసిన పాపాలు పోవాలంటే 40 రోజులు గిరిప్రదక్షిణ చేస్తే చాలు గొప్ప పుణ్యము లభిస్తుంది. ఇదీ సాధ్యము కానివారు దీపము రోజున ఒకమారు గిరిప్రక్షిణ చేస్తే చాలు తగిన పుణ్యాన్ని పొందగలరు. కోటి యాగాలు చేసిన పుణ్యఫలము లభిస్తుంది.

అరుణాచల శిఖరముపై వెలిగించే జ్యోతిని దర్శించినవారు ఆయన అనుగ్రహమునకు పాత్రులగుదురు. ఆయన దీవెనలను పొందగలరు. దీపోత్సవ దినమున ఎవరైన, ఏశివాలయమందైన వత్తిచేసి, చమురు పోసి జ్యోతిని వెలిగిస్తే చాలు అరుణాచలుని కృపకు పాత్రులగుదురు భక్తుని పరిస్థితి ఎట్టిదైన కావచ్చు అతడు ఆదినమున లభించిన నూనెతో వత్తిని వెలిగిస్తేచాలు గొప్ప భాగ్యాన్ని పొందగలడు.

ఇందుకు సంబంధించిన కధయిది.

పూర్వము పాంచాలదేశాన్ని వజ్రసేనుడనే రాజు పాలించేవాడు. ఆయనకు చాలా కాలము వరకు సంతానము లేదు. చివరకు అరుణాచలానికి వచ్చి కార్తీకదీపాన్ని దర్శించాడు. ఆ పుణ్యఫలముతోఒక కుమారుడు అరుణాచలుని అనుగ్రహమువలన పుట్టాడు. అతని పేరు శతృజిత్. అతడు పెరిగి పెద్దవాడై వ్యసనలోలుడయ్యాడు. ఒక వేదపండితుని భార్యను ఎత్తుకొని తిరువణ్ణామలైకి పోయాడు. అక్కడ వారిరువురు అరుణాచలేశ్వరుని దర్శనార్ధము గుడిలోకి పోయారు. అది దీపోత్సవపు పండుగ రోజు. ఆ ప్రియురాలు తన చీరెను చింపి వత్తిచేసి

చమురుపోసి యువరాజు సాయపడగా జ్యోతిని వెలిగించి వారిరువురు అరుణాచలేశ్వరునకు నమస్కరిస్తున్నారు. ఇంతలో వేదపండితుడు తన భార్యను వెదకుచూ అటకు వచ్చాడు. వారిని చూచి కోపోద్రిక్తుడై వారిద్దరినీ కత్తితో పొడిచాడు. ఇది సహించలేక రాజ కుమారుడు తేరుకొని ఆ వేద పండితున్ని పొడిచాడు. ఇప్పుడు ముగ్గురూ మరణించారు. వారిని నరకానికి తీసుకొనిపోవుటకు యమదూతలు వచ్చారు. ఇంతలో శివదూతలు వచ్చి యువరాజు మరియు అతని ప్రియురాలు శివునకు సంబంధించినవారని వారిని శివసాముజ్యానికి చేర్చారు. ఇక యమదూతలు వేదపండితున్ని యమలోకానికి తీసుకపోతున్నారు. ఇంతలో యువరాజు వచ్చి వేద పండితునిచే దీపమును వెలిగింపజేశారు. వెంటనే వేదపండితుడు కూడా ముక్తిని పొందాడు. ఈ విధంగా ఆమువ్వురు ఎటువంటి సాధనలేకయే కేవలం దీపోత్సవపు రోజున జ్యోతిని వెలిగించి దర్శనముతోనే గొప్పపుణ్యాన్ని పొంది అరుణాచలుని కృపకు పాత్రులై తరించారు' ఇదే దీపోత్సవపు మహిమ .

అరుణాచల క్షేత్ర విశిష్టత స్కాందపురాణములో ఈ విధంగా వివరించబడెను. “హరిబ్రహ్మాది దేవతలు మరియు కల్ప వృక్షంబులు ప్రచ్ఛన్న రూపంబుల ఈ శంకరుని సేవించుచుందురు. ఇందుండు వారికి కలిదోషంబులు వుండవు. ఆధివ్యాధి భయంబులు కలుగవు కల్పశతంబులు పుణ్యంబులొనరించినను ఈ అరుణాచలవాసంబు లభింపదు” అని బ్రహ్మ సనక మహర్షికి తెల్పెనని సూతుడు శౌనకాదులకు చెప్పి, “ఈ క్షేత్ర మహత్యంబు వినువారెల్లరు సకల దురితంబులు నశింపగా గత కల్మషులై తరింతురు” అని వివరించారు.

## 11. అరుణాచలుని ఉదాత్తమర్మము

పవిత్రమైన తిరువణ్ణామలై పట్టణములోని దేవాలయాలు, ఆశ్రమాలు పవిత్రమైనవి, ఈ పట్టణము పరమేశ్వరునకు నివాసస్థలము. ఈ పవిత్రక్షేత్రమందు ఎందరో సాధువులు, జ్ఞానులు, అవధూతలు,

సిద్ధపురుషులు నివసించారు, చరించారు. మఠాలు ఒక ప్రత్యేకమైన విశిష్టతను, గొప్పమర్మాన్ని కలిగి ఉన్నాయి. ఇది ఎంతో పుణ్యభూమి.

ఈ పవిత్ర క్షేత్రానికి చుట్టూ 48 కి.మీ లోపల నివసించే వారందరూ ఎటువంటి సాధనలేకయే ముక్తిని పొందగలరు. ఇది పరమేశ్వరుని అభయము. ఈ విశిష్టతను భగవాన్ శ్రీ రమణమహర్షులు కూడా ధృవీకరించారు. అరుణాచల పురాణములో ఈ ప్రదేశము మహామండలంగా పేర్కొనబడినది. ఈ మండలము తిరుక్కోయలూరు, చెంగం, పోలూరు, చెంజీ అను నాలుగు పట్టణాలను, వరుసగా నాలుగు దిక్కులందు కలిగి వర్థిల్లుతూ వున్నవి. అరుణాచలుని సేవించడానికి ఇంద్రాది దిక్పాలురు నాలుగు, గిరిరూపాలు ధరించి నాలుగు దిక్కులందు కొలువైయున్నట్లు పురాణాలు చెబుతున్నాయి.

50 సంవత్సరాలు క్రితము శ్రీరమణాశ్రమములో సాయంత్రము 6గం॥ల తరువాత స్త్రీలు వుండరాదనే నిబంధన వుండేది. ఇందుకు నిరసనగా సుజాతసేన్ అనే ఆంగ్లేయ వనిత కొండపైకి వెళ్ళి రాత్రంతా అక్కడే గడిపింది. "ఓ అరుణాచలా! రాత్రివేళ రమణాశ్రమములో వుండరాదంటే నీకడకు వచ్చాను నన్ను మన్నింపుము. నీచల్లని ఒడిలో హాయిగా నన్ను నిద్రపోనీ" అని అరుణాచలున్ని ప్రార్థించింది. అరుణాచలుడు కరుణాసముద్రుడు. ఆమెను తన అంకసీమపై పరుండబెట్టుకొన్నాడు. తనయగా లాలించాడు. బుజ్జగించాడు. అంతేగాక తన అద్భుతమహిమ చూపించాడు. ఆమె ఆయనలో విశ్వమంతా కన్నులారా చూచింది. ఆశ్చర్యపడింది. తిరిగి వచ్చి ఆ విశ్వరూపాన్ని ఆశ్రమములోని వారందరకూ చెప్పింది. అప్పుడు ఆమె మాటలను ఎవరూ నమ్మలేదు ఐతే 1970లో ఎస్.ఎన్ తాండన్ అనే ఆయన కొండపైకి వెళ్ళి ఒక రాత్రంతా అందే గడిపాడు. ఆయన కూడా అద్భుతదృశ్యాలను అరుణాచలునిలో దర్శించాడు. ఈ వింత విషయాలను, అద్భుతాలను ఆశ్రమంలో చెప్పాడు అప్పుడు సుజాతసేన్ చెప్పినదంతా నిజమని నమ్మారు. వారే కాకుండా చాలామంది భక్తులు గొప్ప అద్భుతాలను, అనుభూతులను అరుణాచలుని నుండి పొందియున్నారు.

ఒకమారు శ్రీరమణమహర్షి భక్తుడైన టి.కె. సుందరేశమయ్యరు. భగవాన్ను, "గతజన్మలలో మీరేవిధంగా వుండేవారో నాకు దర్శనమివ్వండి" అని వేడుకొన్నాడు. భగవాన్ కరుణించారు. సుందరేశమయ్యరు భగవాన్‌వైపు తదేకంగా చూస్తున్నారు. ఇంతలో ఆయనకు సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నహనుమాన్ సమేతుడైన శ్రీరామచంద్రుని దర్శనభాగ్యం కలిగింది. రెండు గంటలపాటు ఆ దివ్యమంగళ కోదండరామున్ని భగవాన్‌లో చూస్తూ ఉండిపోయాడు. తరువాత భగవాన్ పాదాలపై పడ్డాడు. అప్పుడు భగవాన్ ఆయనతో, "గత జన్మలో నేనేమిటో అర్థమయిందా? ఇప్పుడు అయోధ్య ఎక్కడుందో తెలిసిందా? అంటూ మరలా ఈ విధంగా వివరించారు. అయోధ్య సూర్య లోకములో వున్నట్లు వేదాలు చెబుతున్నాయి. దీనికి ఎనిమిది మూలలు, తొమ్మిది మార్గాలు వున్నట్లు, అందులో దేవతలు నివసిస్తున్నట్లు వేదాలు వివరిస్తున్నాయి. ఆ సూర్యలోకము ఏదో కాదు. అదే అరుణాచలము అగ్నిస్వరూపము. ఈ అరుణాచలము కూడా ఎనిమిది మూలలను, తొమ్మిది మార్గాలను కలిగి వున్నది. ఈ అరుణాచలమే అయోధ్య. ఈ అరుణాచలుడే రాముడు. దక్షిణామూర్తి మరియు సర్వదేవతలున్నూ. శ్రీరామచంద్రున్ని మరియు అయోధ్యను చూడటానికి సూర్యలోకమెక్కడని వెదకుచూ పోవలసిన అగత్యము లేదు. వారిని అరుణాచలములోనే చూడవచ్చును. సర్వదేవతలు మరియు సమస్తమున్నూ అరుణాచలుడే" అని భగవాన్ చెప్పారు.

ఇంకొకమారు ఒక భక్తుడు "భగవాన్! మీరు సర్వాంతర్యామివి. నాకోరికను మన్నించి బ్రహ్మలోకము ఎక్కడుందో సెలవిస్తారా?" అని ప్రార్థించాడు. "ఈ అరుణాచలమే బ్రహ్మలోకము" అని భగవాన్ చెప్పారు. ఇది నిజము. ఎందుకంటే అరుణాచలేశ్వర దేవాలయములో పడమటి దిశయందున్న గోడకు చెవివుంచి వింటే వేదమంత్రాలు వినిపిస్తాయట.

చాలామంది భక్తులు ఈ కొండయందు సిద్ధపురుషులను, ఋషులను చూశారు. ఒకమారు భగవాన్ ఒక భక్తునితో కలసి కొండపైకి పోతున్నారు. అది రాత్రి సమయము. అంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంతలో

పాదుకల శబ్దము వారికి వినిపించింది. ఆశ్చర్యంగా భక్తుడు వింటూనే భగవాన్ వెంట పోతున్నాడు. భగవాన్ ఇది గమనించి, "పాదుకల సవ్వడి వింటున్నావా?" అన్నాడు. "వింటున్నాను భగవాన్. శబ్దమేమో వినిపిస్తున్నది. మరి ఎవరూ కనిపించరు. ఇది వింతగా ఉన్నది," అని భక్తుడన్నాడు. ఔనౌను నిజమే. అక్కడ సిద్ధపురుషులు పోతున్నారులే" అన్నారు భగవాన్.

గిరిప్రదక్షిణకు ప్రత్యేకించి రాత్రిపూట వెళ్ళేవారు అరుణాచల మహిమను తప్పక గ్రహిస్తారు. అద్భుతమైన అనుభవాలను పొందగలరు. మబ్బులులేని నిర్మల రాత్రి వేళల్లో ఆకాశమునుండి కొన్ని ప్రత్యేక నక్షత్రాలు, గ్రహాలు మరియు నక్షత్రాల గుంపులు కొండవైపు దిగివచ్చి ఆయనను తాకి ఆ దివ్యశక్తిని పొంది వెంటనే పోతుంటాయి. ఈ అద్భుతాలను చాలామంది భక్తులు చూశారు.

ఒకమారు భగవాన్ రమణుల సమాధి సేవార్థము రచయితనైన నేను కుటుంబ సభ్యులతో కూడి శ్రీరమణాశ్రమానికి వచ్చాను. మేము మరియు బెంగుళూరు వాస్తవ్యురాలు శ్రీమతి మాలతిగారు తెల్లవారుఝామున 3 గం॥లకు గిరిప్రదక్షిణకు బయలుదేరాము. అది 1985 జనవరి 10వ తేదీ నిర్గిలింగముదాటి నిశీదసమయములో నిర్మలంగా వుండే అరుణాచలుని ముగ్ధమోహన రూపాన్ని చూస్తూపోతున్నాము. ఇంతలో ఒక పెద్దజ్యోతి కొండవెనుక నుండి వస్తున్నది. మాలతిగారు ముందురోజే ఆ వైభవాన్ని చూశారు. అందుచే మాకు వారు దానిని గూర్చి హెచ్చరిక చేశారు. అందుచే మేమావైపు చూశాము. జ్యోతిపైకి వచ్చేకొలది కొండంతా వెలుగుతో ప్రకాశించింది. శిఖరముపై మూడు లేక నాలుగు అడుగుల వరకు వెళ్ళి అక్కడ ఒక నిమిషమాగి తన కాంతినంతా అరుణాచలునిపై పరచి మెల్లగా క్రిందకు దిగుతూ కొండశిఖరము వెనుకకు వెళ్ళిపోయింది. ఈ అద్భుత దృశ్యము కేవలం మూడు నిమిషాలలో జరిగిపోయింది. ఇదంతా మేము గిరిప్రదక్షిణ దారిలోని హనుమాన్ కోవెల ప్రక్కనేగల ఒక మోరీ చెంత నిల్చుని చూచేవారము. ఈ సంఘటన తెల్లవారుఝామున సరిగా గం॥

4-10 ని॥ల సమయంలో జరిగేది. ఈ విధంగా మేము వరుసగా మూడు రోజులు చూశాము. ఆ దివ్యజ్యోతి దర్శనాన్ని తరువాత ఆశ్రమములో చెప్పాము. "నిజంగా అది పుణ్యప్రదమైన దర్శనము. భగవాన్ శ్రీరమణ మహర్షులు శరీరము వదిలే సమయమున ఆయన నుండి ఒకజ్యోతి బయలుదేరి కొండపై ఈశాన్యమున కొంతసేపువుండి తరువాత అరుణాచలములో కలసిపోయింది" అని జీవించియున్న భగవాన్ భక్తులు చెప్పారు.

ఇంకొకమారు నేను, నా సతీమణి లక్ష్మీదేవి, హైదరాబాదు వాస్తవ్యులు శ్రీరమణయ్యగారు మరియు వారి సతీమణి అందరము కలసి అరుణాచలుని దక్షిణ ముఖమున నైరుతి దిశలో గల లోయను చూడటానికి వెళ్ళాము. ఎందుకంటే ఆలోయలో వింత విషయాలను నేను చూశాను కాబట్టి కొంతదూరము పోయేసరికి మాకు దారి సరిగా కనిపించడములేదు. అందుచే ఆడవారినీ ఇద్దరినీ ఒకచోట కూర్చుండబెట్టి మేమిద్దరము దారిని పరిశీలిస్తున్నాము. ఇంతలో అక్కడ కూర్చున్న నా భార్యకు "అమ్మా! అమ్మా! అమ్మా!" అని మూడుమారులు పిలుపు వినిపించింది. ఆమె వెనుకకు తిరిగి చూచింది. ఒక గుహదాని వెనుక శిలపైన ఇద్దరు వింత మనుష్యులు ఆమెకు కనిపించారు. అందుచే ఆమె వారిని చూస్తూ మమ్ములను పిలిచింది. మేము వచ్చి వారిని చూశాము. వారి శరీరము దవళవర్ణముతో తెల్లగా మెరసిపోతున్నారు. కళ్ళు మాత్రము నల్లగా కనిపిస్తున్నాయి. ముందుకు పోరాదన్నట్లు చేతులు వూపుతున్నారు. ఆ చేతులా ఆజానుబాహువులు. ఆ చేతులు, కాళ్ళు, పాదాలు, శరీరమంతా మానవ శరీర నిర్మాణానికిమించి వుంది. గొప్ప శరీరాకృతితో వారు దర్శనమిచ్చారు. వారు సిద్ధపురుషులని మేము భావించి వారికి నమస్కరించి వెనుదిరిగి వచ్చాము. ఈ దివ్యమూర్తులను 100 అడుగుల దూరములో కొంచెము ఎత్తులో చూశాము. ఆ మహానుభావులలో ఒకరేమో భగవాన్ మరొకరేమో భగవాన్ భక్తులైన అణ్ణామలైస్వాములు. ఈ పరమాద్భుతాన్ని అరుణాచలుని యందు 21-8-1999 తేదీన సాయంకాలము 4 గం॥ లకు చూశాము. వారిని

చూచినపుడు నామేను పులకించింది. బ్రహ్మరంధ్రమున చైతన్యము ప్రజ్వలించింది. అప్పుడేకాదు ఇప్పటికీ ఆ ప్రదేశమును చూడబోవుచుండగా కొంతదూరమునుంచే చైతన్యతాండవము జరుగుతుంది.

సిద్ధపురుషులు దర్శనమిచ్చిన ఆ స్థలము కడుపవిత్రంగా మేము భావించాము. జ్ఞాపకార్థము 20-10-1999నాడు కెమెరా తీసుకువెళ్ళి ఆ ప్రాంతాన్ని సాయంకాలము గం॥ 4-00లకు ఫోటో తీయించాము. అందులో అరుణాచలుని జ్యోతిస్తంభము అద్భుతంగా కనిపించింది. రెండు ఫోటోలు తీయగా రెండింటిలోను బ్రహ్మవిష్ణువుల తగవును తీర్చుటకు పరమేశ్వరుడు వారి మధ్య వెలసిన తేజస్తంభము తేజోవంతముగా, మనోహరంగా దర్శనమిచ్చింది. ఆ ఫోటోలు ఇందులో ముద్రించబడినవి. ముఖచిత్రము చూడండి.

యుగాలకు పూర్వము బ్రహ్మవిష్ణువులు మధ్యవెలసిన పరమేశ్వరుని తేజోరూపమది. ఆ తేజోరూపమే అరుణాచలము. ఆ దివ్యరూపము మా వంటి సాధారణులకు కనిపించి, దానిని ధృవీకరించుటకు ఫోటోలో కనిపించాడంటే అరుణాచలుని కరుణ ఎంత గొప్పదో మనము గ్రహింపవచ్చును. నేను ఈ పుస్తకాన్ని వ్రాస్తూ కోరగా తన అద్భుతాలను ఇలా చూపించాడు. ఇంతకంటే పరమాద్భుతము ఏమున్నది! చెప్పండి అరుణాచలుని లీలలు అత్యద్భుతాలు. ఎల్లప్పుడు తన భక్తులకు తన ఉదాత్తమైన మర్మాన్ని, లీలలను ఏదోవిధంగా తెలియజేస్తుంటాడు. అరుణాచలుడు కేవలం చెట్లు చేమలతోను, రాళ్ళురప్పలతోను కూడిన సాధారణ పర్వతముకాదు. నిజంగా అరుణాచలుడు తేజోస్వరూపుడు. ఇందుకు ఈ ఫోటోలే ప్రబల సాక్ష్యము.

ఈ కొండంతా ఓషధుల మయము. ఇది ఔషధాల మల. ఇందలి ఔషధాలు ఆకలిని పోగొట్టును, దప్పికను తీర్చును, రోగములను తొలగించును, మరణమును మాన్పును. ఈ కొండలో లోహమును బంగారుగా మార్చే ఓషధులు కూడు ఉన్నట్లు ప్రతీతి. గిరిప్రదక్షిణ చేసే

భక్తులు కొండనుండి వచ్చే ఓషధుల గాలివలన చల్లదనాన్ని, శక్తిని, ఆరోగ్యాన్ని పొందగలరు. ఈగాలి స్వచ్ఛాతి స్వచ్ఛంగా, హాయిగా ఉంటుంది. నిజంగా అరుణాచలుడు మాతృహృదయుడు, బిడ్డలను కాపాడే తల్లిలాంటివాడు. తన అనుంగు భక్తులను నిరంతరము రక్షిస్తూనే ఉంటాడు.

అరుణాచలుని యందు అనేక గుహలున్నాయి. కొన్ని గుహలు రెండూ లేక మూడు రాళ్ళచే ఏర్పడి ఒకరు నివసించడానికి యోగ్యమైయున్నవి. ఇవి వర్షమునుండి, చలినుండి, ఎండనుండి కాపాడగలవు. మరికొన్ని విశాలమైన గుహలు. అవన్నీ పెద్దపెద్ద గుండ్లలచే ఏర్పడి కొంతమంది వుండటానికి తగినవై యున్నవి. కొన్ని చిన్న ముఖద్వారములు కలిగి ఉంటాయి. లోనికిపోతే విశాలమైన స్థలము. ఓం నమశ్శివాయ గుహ, విరూపాక్ష గుహ, స్కంధాశ్రమము ఇవన్నీ ఇటువంటి గుహలే. ఈ కొండలో విశాలమైన బయలు ప్రదేశాలున్నాయి. అవన్నీ చూడముచ్చటగా ఉంటాయి. చిన్న చిన్న బాటలు, పూదోటలు, చిన్ననీటి వూటలు మున్నగు మనోహర దృశ్యాలతో కూడిన సొరంగాలున్నట్లు ప్రతీతి. ఈ గుహలలో తెలియని వింతలు, విశేషాలు ఎన్నో ఉన్నాయంటారు. వీటియందు సిద్ధపురుషులు గాఢ సమాధిస్థితిలో ఉంటారట. ఇవన్నీ మన పురాణాలు చెప్పి ఉన్నాయి. అంతేకాదు భగవాన్ శ్రీరమణమహర్షి మరియు యోగులు ఈ మర్మాన్ని ధృవపరచియున్నారు.

అరుణాచలుని మహిమ ఒక ఉదాత్తమైన మర్మము. అది అంతుపట్టని రహస్యము. దీనిని తెలుసుకున్న వారు ధన్యులు, చరితార్థతములు. ఇది మహిమాన్వితమైన పర్వతము. అందుకే భగవాన్ రమణులు, "గిరిరూపమైనట్టి కరుణా సముద్రుడు అరుణాచలుడు కనిని జనని కన్న ఘనదయాదాయకుడు అరుణాచలుడు" అని అరుణాచలని ఉదాత్తమర్మాన్ని గూర్చి పొగిడియున్నారు.

## 12. ముఖ్య పండుగలు

అరుణాచలేశ్వర దేవాలయమందు అనేక పండుగలు జరుగును కొన్ని పండుగలేమో కొన్ని రోజుల పాటు జరుగును. మరికొన్నేమో ఒక రోజుతోనే ముగియును. సూర్యుడు ఉత్తరానికి మర్లేసమయాన ఉత్తరాయణ పండుగ జరుగుతుంది. జనవరి మాసములో ఈ పండుగను మహావైభవంగా పదిరోజులు జరుపుతారు.

తరువాత ముఖ్యంగా చెప్పదగిన పండుగ మహాశివరాత్రి. ఈ పండుగ ఫిబ్రవరి లేదా మార్చి నెలలో జరుగుతుంది. ఇది అతిప్రధానమైన పండుగ పరమేశ్వరుడు జ్యోతిస్తంభధారియై కలహించుకొనే బ్రహ్మావిష్ణువుల మధ్య నిలచి వారి గర్వమును తొలగించి అణుకువను ప్రసాదిస్తాడు. అరుణాచలముగా ఉండిపోతాడు. వారు మరల అరుణాచలాన్ని అనేక విధాలుగా ప్రార్థింపగా వారి ప్రార్థనను మన్నించి పరమేశ్వరుడు లింగరూపాన్ని ప్రసాదిస్తాడు. ఈలింగోద్భవము శివరాత్రి పండుగ నాటి రాత్రి జరిగింది. అందుకే శివరాత్రి పండుగకు అధిక ప్రాధాన్యత ఏర్పడింది.

శైవమతము ప్రారంభమైన నాటి నుండి తిరువణ్ణామలైలో జరిగే శివరాత్రి పండుగకు ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. శివరాత్రి పండుగకు ముందురోజే పట్టణము మరియు దేవాలయము దేదీప్యమానంగా వెలిగిపోతూవుంటుంది. పండుగకు ముందురోజు రాత్రి రెండూ లేక మూడు గంటలనుండి దేవాలయద్వారాలన్నీ తెరుస్తారు. మొదట అరుణాచలేశ్వరునకు అభిషేకము తరువాత వేదోచితంగా పూజలు జరుగుతాయి తదనంతరము లాక్షార్చన. ఈ అర్చన పండుగ నాటి ఉదయము 5గం ||లకు ప్రారంభమై సాయంత్రం 4 గం||ల వరకు జరుగుతుంది. ఇక శివరాత్రినాటి రాత్రంతా దేవాలయము తెరువబడి వుంటుంది. నాలుగు కాలాలు పూజలు జరుగుతూ వుంటాయి. ఇలా పూజలతో రాత్రంతా గడిచిపోతూ ఉంటుంది. గర్భగుడి చుట్టూ అనగా

రెండవ ప్రాకారములో భక్తులు రాత్రంతా ప్రదక్షిణలు చేస్తుంటారు. లక్షలాది భక్తులు పగలు రాత్రి గిరి ప్రదక్షిణ చేస్తుంటారు కొందరు గిరి ప్రదక్షిణ చేసి వచ్చి అరుణాచలేశ్వర దేవాలయములో జరిగే పూజలను చూస్తూ జాగరణ చేస్తారు. రాత్రి 12 గంటలకు లింగోద్భవ సమయము. అప్పుడు గుడిగంటలన్నీ మ్రోగుతాయి గర్భగుడిలోపల మరియు బయట అరుణాచలేశ్వరునకు హారతులిస్తారు. ఆ హారతులను భక్తులు కళ్ళారా చూచి తమ జన్మ ధన్యమైనట్లు భావిస్తారు.

భగవాన్ రమణ మహర్షులు జీవించి వుండే కాలములో శ్రీరమణాశ్రమములో కూడా మహాశివరాత్రి పర్వదినము వైభవంగా జరిగేది. అది శివరాత్రి పర్వదినము. భగవాన్ రమణ మహర్షులు ఆశీనులై కొండ వైపు చూస్తున్నారు. ఆయన చెంత భక్తులు చేరియున్నారు. ఇంతలో ఒక భక్తుడు, "భగవాన్! దక్షిణమూర్తి స్తోత్రములోని ప్రాశస్త్యమును గూర్చి చెప్పండి. జాగరణ గడుస్తుంది" అని వేడు కొన్నాడు. భగవాన్ 'సరే' అన్నట్లు తల వూపారు. ఇక భగవాన్ ఏమి చెబుతారో వినాలని ఆసక్తితో ఆయన ముఖారవిందము వైపు అందరూ చూస్తున్నారు. కానీ భగవాన్ ఏమీ మాట్లాడలేదు మౌన ముద్రధారియై తదేకంగా అరుణాచలని వైపు చూస్తున్నారు. ఆమౌనము అఖండమై పోయింది. గడియారము ఆడుతూ వుంది. గంటలు గడిచిపోయాయి. అక్కడ కేవలం నిశ్శబ్దత చోటు చేసుక్కొంది. భక్తులందరూ తమలోతాము మునిగిపోయారు రాత్రి పోయింది. అరుణోదయమయింది. ఇప్పుడు అందరకు దేహాత్మభావన కలిగి మెలకువ వచ్చింది. అప్పుడు భగవాన్ ప్రశ్నవేసిన భక్తుని వైపు చూచి, "ఇప్పుడు దక్షిణామూర్తి స్తోత్రవిశిష్టత తెలియవచ్చిందా?" అన్నారు. అందరూ తలలు వూపారు. కృతజ్ఞతా పూర్వకంగా భగవానునకు నమస్కరించారు. అప్పుడు భగవాన్ ఇలా అన్నారు. "శివరాత్రి జాగరణ అంతరార్థము కూడ ఇంతే అంటే రాత్రంతా తనలో తాను మునిగి మెలకువతో నిద్రపోవాలి. ఇప్పుడు మీరందరూ చేసింది ఇదే. ఇదే శివరాత్రి జాగరణ పరమార్థము ఈ విధమైన ఆత్మనిష్ఠతో గిరిప్రదక్షిణ చేయండి. అది మహాపుణ్యము అని భగవాన్ ఉపదేశించారు.

ఏప్రియల్ లేదా మే మాసములో వసంతోత్సవపు పండుగ జరుగుతంది. ఇది కామదహన మహోత్సవము. కామసంకల్పాలకు మూలమైన మన్మథుని నాశనము చేసే రోజది. ఈ పండుగను కూడా పది రోజులు చేస్తారు.

ఇక చెప్పుకోదగినది "తిరువడల్" పండుగ. పార్వతీ పరమేశ్వరుల మధ్య ఏర్పడిన కలహము సుందరర్ మహాముని ప్రమేయముతో తొలగిపోతుంది. వారు నాటితో భేదము మరచి ఒకటౌతారు. ఆ రోజున దేవాలయ అర్చకులు పార్వతీపరమేశ్వరులు మరియు సుందరర్ వేషాలు ధరించి అభినయిస్తారు. ఇదంతా చూడ ముచ్చటగా వుంటుంది.

ఇక చెప్పదగినది నవరాత్రి వుత్సవాలు. ఈ ఉత్సవాలు కూడా వైభవంగా జరుగుతాయి. పార్వతీ అంశమైన 'దుర్గ లోకకంఠకుడైన మహిషాసురున్ని 9 రోజుల యుద్ధము చేసి పదవ రోజున సంహరిస్తుంది. ఇందుచేత తిరువణ్ణామలై పట్టణములో వుండే అమ్మకోవెలలో నవరాత్రి వేడుకలు కన్నుల పండుగగా జరుగుతాయి. అరుణాచలేశ్వర దేవాలయములో ఈ పండుగను వైభవంగా జరుపుతారు. అంతేగాదు. ఆ పట్టణమందున్న దుర్గమ్మ కోవెలలో అమ్మకు మహిషాసురమర్ధిని అలంకారాన్ని చేస్తారు. ఘనంగా వేడుకలు జరుపుతారు.

ఇక సూర్యుడు దక్షిణానికి వాలుతాడు ఇదే దక్షిణాయనము ఈ కాలాన్ని పురస్కరించుకొని దక్షిణాయన పండుగను 10 రోజలు చేస్తారు. ఈ పండుగను కూడా మహాసంబరంగా చేస్తారు.

ఇక సంవత్సరములో మూడు రోజులు అరుణాచలేశ్వరుడు పలుతావు లందుగల తన భక్తులను వెదకుతూ పోతాడు. ఇదొక సంప్రదాయము. జనవరి నెలలో మనలూరుపెటై మరియు కలసపాక్కమ్‌ను, ఆగష్టు మరియు సెప్టెంబరు మాసాలలో కీల్‌నత్తూరును దర్శిస్తాడు. అరుణాచలేశ్వరుడు బయలుదేరే ముందు పూజలు చేస్తారు ఆ పూజలు చూడ మనోజ్ఞంగా' వుంటాయి. ఈ పండుగలే గాక స్కంధషష్ఠి, తిరుకల్యాణము మాణిక్యవాచకర్ పది రోజుల వేడుక మున్నగు

పండుగలను కూడా ఇక్కడ చేస్తారు.

ఇక మనము దక్షిణ భారత దేశంలో అతి ప్రాచీనమైన "కార్తీక దీపం" పండుగను గూర్చి తెలుసుకొందాము. ఈ పండుగ గొప్ప ప్రాధాన్యతను కలిగి వున్నది. దీనిని తిరువణ్ణామలైలో మహావైభవోపేతంగా జరుపుతారు. పౌర్ణమి నాడు జరుగుతుంది. ఈ పండుగను గూర్చి తెలుసుకొనే ముందు దాని ప్రాచీనతను గూర్చి కూడా కొంచెము తెలసుకొందాము.

ప్రాచీన తమిళ సాహిత్యములో "తోల్కాప్పియం" అతి పురాతనమైన రచన. ఈ గ్రంధము తమిళవ్యాకరణాన్ని మరియు ఇతర విషయాలను కూడా తెలుపుతుంది. ఈ రచన క్రీ.పూ. 2000-2500 కాలము నాటిదని సాహిత్యవిమర్శకుల అభిప్రాయము ఈ గ్రంధములో ఒక సూత్రమందు, "దీపపు శిఖ పైభాగాన్ని సూచించు విధముగా" అని ఒక ఉపమానాన్ని ప్రయోగించాడు. ఒక వ్యాఖ్యాత ఈ వాక్యాన్ని ఇలా పేర్కొన్నాడు. "మిక్కిలి దేదీప్యమానమై గాలికి కదలక ఆకాశమునకు వ్యాపించే అణ్ణామలై కొండపై వెలిగించే జ్యోతిని, దాని వైభవాన్ని ఉపమానంగా ఉదహరించాడు" అని. ప్రాచీన కాలమందలి జైనకవి వ్రాసిన "జీవక చింతామణి" లోను, తిరుత్తక్కతేవార్‌లోను ప్రజలు కార్తీక దీపోత్సవాన్ని జరుపుకొనే విధమును మనోహరంగా వివరించబడినది. సంగము కాలమందలి తమిళ ప్రాచీన సాహిత్యములో కార్తీక దీపోత్సవ వైభవము వివరించబడినది. "కర్నర్‌పాడు" అనే రచనలో కవి ఒక పద్యములో, "తమిళమాసమైన కార్తీకమందు కృత్తికా నక్షత్రాన ప్రజలచే వెలిగించబడే జ్యోతి భూమిమీద వికసించి వ్యాపిస్తుంది. దాని మేల్కొలుపుతో వర్షము ప్రారంభమౌతుంది" అని వివరించాడు ఇంకొక తమిళప్రాచీన రచన "కళావలినార్పదు" ఇది మూడవ సంగము వంశీయులు కాలంలో (క్రీ.పూ. 1000) వెలసింది. ఈ రచనలో కవి అంటాడు. "యుద్ధభూమిలో మరణించిన యుద్ధవీరుల మృతదేహాల నుండి ప్రవహించే రక్తపు ఏరులు. కార్తీక దీపోత్సవమునాడు దీపస్తంభము వెలిగింప అది ఎర్రని కాంతితో నలుదిశల వ్యాపించు రీతిగా వుందని"

వర్ణించాడు. ఈ కాలమందలి ఇంకొక రచనయైె "పళమోళి"లో ప్రతిపద్యము చివర "కొండపైని జ్యోతివలె" అనే అర్థము వచ్చే మకుటము ప్రయోగించబడినది.

జ్ఞానసంబంధర్ వ్రాసిన "తేవారమ్"లో చిన్నారియైన పుంపావైని మృత్యువు నుండి మేల్కొలపే సమయాన ఆయన బాధతో, "ఓ పుంపావై! పవిత్రమైన కార్తీకదీపోత్సవాన్ని చూడకమునుపే వెళ్ళి పోయావా?" అని అంటాడు. "తేవారం"లో ఇంకొక పాటలో "జగత్తును పాలించే ప్రభువే దీపం (కార్తీకాన వెలిగించే జ్యోతి) అని పేర్కొన్నాడు "కార్తికేయదీపం" అనే రచనలో సుమారు నూరుపద్యాలలో దీపోత్సవ వైభవము వర్ణించబడినది. భగవాన్ను కార్తీకదీపప్రాధాన్యతను వివరించమన్నారు భక్తులు. అందుకు భగవాన్ నాలుగ చరణాలుగల ఒక పద్యాన్ని వ్రాసియిచ్చారు. దాని భావమిది. "కార్తీక దీపోత్సవము నిన్ను లోనికి మరలించి హృదయమున చేర్చి అందులో మునుగునట్లు చేస్తుంది."

శతాబ్దాల కాలము నుండి ఈ ఉత్సవము ఒకే విధమైన ఆచార పద్ధతులతోను, పూజాది కార్యక్రమాలతోను విలసిల్లుతూ వస్తున్నది. పండుగకు కావలసిన ఏర్పాట్లన్నీ దేవస్థానమువారు మరియు పురపాలక సంఘమువారు చేస్తారు. ప్రతి సంవత్సరము ఏర్పాట్లన్నీ యధాతథంగా జరుగుతూ వుంటాయి. అరుణాచలునకు మాత్రము ప్రతి సంవత్సరము నూతనానుభవమే ఆయన ఆనందముతో ఏర్పాట్లన్నీ తిలకిస్తాడు. భక్తులకు సుఖశాంతులను ప్రసాదిస్తాడు.

దీపోత్సవాన్ని కన్నులారా చూచి ముక్తిని పొందుటకు లక్షలాది మంది భక్తులు సుదూరప్రాంతాల నుండి తిరువణ్ణామలైకి వస్తారు. దేవాలయంలో దీపోత్సవకార్యక్రమము "పందల్ కాల్" ముహూర్తముతో ప్రారంభమౌతుంది. ఇది కేవలం చిన్నకార్యక్రమమే. ఆహ్వాన పత్రికలు పట్టణమంతా పంచుతారు. 16 రోజుల పాటు జరిగే ఈ పండుగలో మొదటి మూడు రోజులు పలువురి దేవతలను పూజించి వారిని సంతోషపరుస్తారు. తరువాత మూడురోజులలోను కొండపైన దీపాన్ని

వెలిగించే మంగళప్రదమైన కార్యక్రమాలు రూపుదిద్దుకొంటాయి. ఇక పతాక ఆవిష్కరణతో 10 రోజుల పండుగ.ప్రారంభమౌతుంది. దీనినే "ధ్వజారోహణం" అంటారు. ఈ వేడుకను తిలకించుటకు లక్షలాది మంది భక్తులు వస్తారు.

ఆ దినము అరుణాచలేశ్వరున్ని బాగా అలంకరించి గుడి నుండి బయటకు తెస్తారు. తెచ్చి ధ్వజస్తంభము ముందు కూర్చోబెడతారు. ఆయన సమక్షములో ధ్వజారోహణ కార్యక్రమము ప్రారంభమౌతుంది. నిర్ణీత సమయములో మంగళ వాయిద్యాలు మ్రోగుచుండగా, అర్చకులు వేదమంత్రములు చదువు చుండగా పతాకాన్ని ఆవిష్కరిస్తారు. తరువాత పూజారులు సప్తనదులను, దేవతలను, ఋషులను, ఈ మహోత్సవానికి ఆహ్వానిస్తారు. ధ్వజారోహణము ముగిసిన పిదప అరుణాఛలేశ్వరున్ని తీసుకవెళ్ళి దక్షణ దిశలో వున్న పెద్ద హాలులో వుంచుతారు. ఆ పది రోజులు అరుణాచలేశ్వరుడు అలంకారమంటపములో వుంటూ తన బిడ్డలైన భక్తులకు దర్శనమిస్తాడు. రోజుకు పలుమార్లు గుడినంతా దర్శిస్తాడు. చుట్టూ తిరుగుతాడు. వేదమంత్రాలు వింటాడు. తక్కిన విగ్రహాల వుత్సవాలను తిలకిస్తాడు.

ప్రత్యేకించి ఐదవనాటి రాత్రి అరుణాచలేశ్వరుడు వృషభ వాహనారూఢుడై చరిస్తాడు. ఇక ముఖ్యమైనది ఎనిమిదవ రోజు పండుగ రథోత్సవము ఆ రోజు అణ్ణామలయ్యార్ మరియు ఉణ్ణామలై అమ్మ, వీరిద్దరు పెద్ద రథములో ఆశీనులు కాగా, తక్కిన దేవతలు తమతమ రథాల నధిరోహించి వెంటరాగా పార్వతీ పరమేశ్వరులు ఊరేగుతారు. ఈఉత్సవములో గణేశ్ సుబ్రహ్మణ్యస్వాములు ముందుంటారు వేలాది మంది భక్తులు రథాన్ని లాగుచుండగా రథము మెల్లగా భక్తుల సందోహముతో కదలిపోతూ వుంటుంది. రథము పడమటి వీధిని చేరేసరికి సాయంకాలమౌతుంది. శీతాకాలంలోని సూర్యుని తేజోవంతమైన చల్లని కిరణాలు కొండశిఖరము నుండే తొంగిచూస్తూ అక్కడ చేరిన భక్త సందోహాన్ని చల్లదనంతో ముంచేస్తాయి. ఆ సమయాన కొండ ఒకవైపు వుంటుంది. మరొక వైపు దేవాలయ గోపురాలు

వుంటాయి. మధ్యలో అరుణాచలేశ్వరుడు మరియు ఆపీతకుచాంబ రథముపై ఊరేగితూ వుంటారు. ఈ వైభవాన్ని గగనతలము నుండి దేవతలు, సిద్ధులు, ఆనందంగా చూస్తూ పరవశిస్తూ వుంటారు.

ఇక పదవరోజు పండుగ భక్తికి పరాకాష్ఠ, భక్తుల భక్తి ధ్వజారోహణతో ఆరంభమయింది. రోజురోజు వృద్ధి చెందింది. ఇక చివరి రోజైన దీపోత్సవానికి చేరుకొన్నది ఈ రోజు ఉదయాన భరణీ దీపాన్ని వెలిగిస్తారు. ఇది కార్తీక దీపాన్ని ముందుగా తెలియజేసేధి. దీపోత్సవాన్ని చూచుటకు దేశవిదేశాల నుండి ఎందరో భక్తులు వస్తారు. భాషలు వేరు, మతాలువేరు, ఆచారాలు వేరు. కానీ అందరూ కలసి అరుణాచలుని యెడ ఒకేవిధమైన భక్తిని ప్రదర్శిస్తారు. సకల దేవతల ప్రార్థనానుసారం అరుణాచలుడు ఆ కొండ శిఖరముపై జ్యోతిరూపంలో దర్శనమిస్తాడు.

దీపోత్సవము నాడు దేవాలయ ప్రాంగణమంతా అందంగా అలంకరించబడి వెలిగిపోతూ వుంటుంది. భక్తులు వేడుకలను చూచుటకు దేవళములో చేరి ఉంటారు. దేవళమంతా భక్తజన సందోహంతో నిండి వుంటుంది. ఆ భక్త సముద్రాన్ని చూస్తేనే ఇక కార్తీక దీపోత్సవము ప్రారంభ మౌతుందని చెప్పవచ్చును. అరుణాచలేశ్వరున్ని బంగారు నగలతో, పూలమాలలలో అందంగా అలంకరిస్తారు. తరువాత తెరతీస్తారు. భక్తులందరూ తమ యిష్టదైవము యొుక్క మనోహరవైభవాన్ని నయనానందకరంగా చూస్తారు. అర్చకులు పూజలు చేస్తారు. తరువాత కర్పూర హారతులిస్తారు. ఒక వైపు గంటలు మ్రోగుతుంటాయి. ఇంకొక వైపు మంగళవాయిధ్యాలు, ఢంకాభేరీనినాదాలు, ఇంకొకవైపు భక్తులందరూ ఏకకంఠముతో "అణ్ణామలై యారుక్కు హరోహరా!" అని గగనతలమంతా నిండే విధంగా నోరార ఎలుగెత్తి పిలుస్తుంటారు. ఆహారతిని తెచ్చి యజ్ఞశాలలో ఐదు ప్రమిదలందు వెలుగుతున్న జ్యోతులకు చూపిస్తారు. ఈ ఐదుజ్యోతుల నుండి ఒక దివిటీని వెలిగించి కొండపైకి తీసుకపోతారు. కొండ శిఖరము పైన ఒక పెద్దరాగి ప్రమిదలోని గంగాళంలో పెద్ద వత్తి నెయ్యి మరియు

కర్పూరము చేర్చి జ్యోతిని వెలిగించుటకు సిద్ధము చేసి వుంటారు.

శీతాకాల మందలి సూర్యుడు అస్తమిస్తేనే వాతావరణంలో చల్లదనము, నిశ్శబ్దత వెలుపలను, దేవాలయములోను వ్యాపిస్తుంది. జనమంతా జ్యోతిని చూడటానికి ఉవ్విల్లూరుతూ వుంటారు. ఇక దేవళము నుండి దూరంగా వున్న వీదులలో భక్తులు మేడలు, మిద్దెలు ఎక్కి ఆ పరంజ్యోతిని తిలకించడానికి నిరీక్షిస్తూ వుంటారు.

సరిగా సాయంకాలము 6 గం॥లకు దేవాలయములో అరుణాచలేశ్వరునకు హారతులిస్తారు. "జ్యోతిని వెలిగించుటకు సిద్ధము కండి" అని కొండ శిఖరమున గల వారికి తెల్పడానికి పెద్ద టపాకులు, బాణాసంచాలు పేలుస్తారు. మంగళవాయిద్యాలు మారుమ్రోగుతాయి. చంద్రుడు తూర్పున ఉదయిస్తుండగా పరమానందముతో, అతిశయించిన ఉత్సాహముతో జ్యోతిని శిఖరముపై వెలిగిస్తారు. ఆ పరంజ్యోతిని చూచినంతనే లక్షలాది మంది భక్తులు "అణ్ణామలైయ్యారుక్కు హరోహరా!" అని కొందరు, 'అరుణాచలశివా! అరుణాచలశివా!' అని కొందరు పెద్దపెట్టున అభినందిస్తూ నినాదాలు చేస్తారు. శిఖరాగ్రముపై జ్యోతి తేజోవంతంగా వెలుగతూ వుంటుంది. అరుణాచల నామధ్వని నలుదిశల వ్యాపించి వుంటుంది. పౌర్ణమినాటి చంద్రుడు తన వెలుగును కొండపై పరుస్తాడు. అరుణాచలుని తేజోవంతమైన దయాకిరణాలు భక్తుల హృదయాలల్లోకి దూసుక పోతాయి. అప్పుడు భక్తులు పొందే ఆనందానికి మేరలేదు.

ఇక శ్రీమతి సూరినాగమ్మ వ్రాసిన "శ్రీరమణా శ్రమలేఖలు" అనే గ్రంథాన్ని ఆధారంగా భగవాన్‌రమణమహర్షులు జీవించియుండే కాలములో రమణాశ్రమములో జరిగే దీపోత్సవకార్యక్రమాన్ని గూర్చి తెలసుకొందాము.

సాయంకాలము 3 గం॥ల నుండి దీపోత్సవ పండుగకు కావలసిన ఏర్పాట్లన్నీ భక్తులు చేస్తుంటారు. ఆశ్రమమంతా రంగురంగుల రంగవల్లులతో కళకళలాడుతూ వుంటుంది. ఎటుచూచినా

పచ్చతోరణాలు దర్శనమిస్తాయి. సాయంకాలము భక్తబృందముతో భగవాన్ బయటకు వస్తారు. ముందుగా ఆయన కూర్చొనుటకు సోఫాను కొండవైపు ముఖముతో ఏర్పాటుచేసి వుంటారు. భగవాన్ వచ్చి సోఫా మీద కూర్చుంటారు ఆయనకు ఎదురుగా ఒక ఎత్తు స్టూలు మీద పెద్ద కంచుహారతి పళ్ళెము వుంచియుంటారు. కావలసినంత నెయ్యి అందులో పోసియుంటారు. భక్తులందరూ వరుసగా వచ్చి కూర్చుంటారు. మగవారు భగవానుకు కుడివైపున, ఆడవారు ఎడమ వైపున స్థలమంతా బుట్టలతో, తినుబండారాలతో నిండియుంటుంది. భక్తులు తెచ్చి నెయ్యి ప్రమిదలో పోస్తుంటారు. ఆయన దీపోత్సవ ప్రాధాన్యతను చెబుతూ, "జ్యోతిని అక్కడ వెలిగిస్తారు" అని ఆ ప్రత్యేక స్థలాన్ని చూపిస్తుంటారు. అప్పుడాయన ముఖము తేజోవంతంగా వుంటుంది. ఆ తేజోవంతమైన కాంతి అరుణాచలునిపై బడి తిరిగి భగవాన్ వదనారవిందాన్ని చేరుతున్నట్లు వుంటుంది. దేవాలయములో టపాసులు ప్రేల్చుతారు. బాణా సంచా వెలిగిస్తారు. వెంటనే కొండ శిఖరముపై జ్యోతి ప్రత్యక్షమౌతుంది. తక్షణమే భగవానుకు ఎదురుగా "అఖండ జ్యోతి"ని వెలిగిస్తారు. వైదిక బ్రాహ్మణులు "నకర్మనప్రజాయధనేన" అని వేదమంత్రలు చదువుతూ హారతినిస్తారు. ఆ కర్పూరహారతిని భగవాన్ మరియు భక్తులందరూ తీసుకొంటారు. తరువాత భగవాన్ అక్కడున్న ఫలహారమును కొంచెము స్వీకరిస్తారు. పిదప అక్కడున్న వాళ్ళందరూ ప్రసాదాన్ని పంచుతారు. ఇక భక్తులందరూ రెండువరుసలుగా కూర్చొని "అక్షరమణమాల"ను పారాయణము చేస్తారు. దాని తరువాత, "కరుణాపూర్ణసుధాబ్ధే" అని పాడుతారు. భగవాన్ మాత్రము గడ్డము క్రింద చెయ్యి వుంచుకొని కూర్చొని వింటూ వుంటారు. అప్పుడాయన ముఖము కాంతివంతంగా, దేదప్యమానంగా ప్రకాశిస్తూ వుంటుంది. అరుణాచలుని మౌనము భగవాన్ మౌనము ఏకమై వుంటాయి. పున్నమినాటి చంద్రుని చల్లని కాంతి కిరణాలు భగవాన్‌పై వ్యాపించి వుంటాయి. దానికి తోడు అరుణాచలుని కరుణాపూర్ణ సుధాకిరణాలు

పై పడి ఆయన అపరిమిత తేజోరాశిగా ప్రకాశిస్తుంటారు.

శ్రీరమణాశ్రమములో నాటికీ నేటికీ యధాతథంగా ఈ వేడుక సాగుతున్నది. అంతేకాదు భగవాన్ కూడా తన ప్రభువైన అరుణాచలున్ని మరియు జ్యోతిని తనివిలీరా చూస్తూ భక్తుల హృదయాలలో నిలచి వుంటాడు.

అరుణాచల శిఖరముపై వెలిగించే దీపము పదకొండు రోజులు లేదా పదమూడు రోజులు వెలుగుతూ వుంటుంది. ప్రతిదినము సాయంత్రము 6 గం॥ల నుండి రాత్రంతా కనబడుతూ వుంటుంది. ఈ జ్యోతిలో ఒక ప్రత్యేకమైన మరియు విశిష్టమైన ఆకర్షణ శక్తి వున్నది. మన చూపును తన వైపు లాగుకొంటుంది. ఆ కాంతి మీద మనస్సుంచి లేక కేవలం ఎరుకతో గిరిప్రదక్షిణ చేస్తుంటే సంకల్పరహితమైన ఆత్మానందము అనుభవమౌతుంది. పరవశుడైన భక్తునకు చంద్రుడు, నక్షత్రాలు, ఆకాశము ఏవీ తెలియరావు. కేవలము అరుణాచలుడు మరియు జ్యోతి ఈరెండింటిలో అందరూ మునిగి వుంటారు.

దీపదర్శనము వలన సమస్తపాపాలు నశించి ముక్తి లభిస్తుంది. ఈ దర్శనము కోటియాగాల పుణ్యఫలము సమస్త తీర్థాలలో క్రుంకులిడి సమస్త క్షేత్రాలను దర్శించిన పుణ్యఫలము. లభిస్తుంది. ఈ దీపదర్శనముతో లెక్కలేని వరాలను పొందవచ్చును. సుఖశాంతులతో జీవింపవచ్చును. ఇది పరమేశ్వరుని నిర్ణయము.

నాస్తి శోణాద్రితః క్షేత్రం
నాస్తి పంచాక్షరాన్మనుః
నాస్తి మహేశ్వరాద్ధర్మో
నాస్తి దేవో మహేశ్వరాత్
నాస్తి జ్ఞానం శివజ్ఞానా
నాస్తి శ్రీరుద్రతః శ్రుతిః
నాస్తి శైవాగ్రణీర్విష్ణో

నాస్తి రక్షాకరాద్గురుః

నాస్తి రుద్రాక్షతో భూషా

నాస్తి శాస్త్రం శివాగమాత్

నాస్తి బిల్వదళాత్పత్రం

నాస్తి పుష్పం సువర్ణకాత్

నాస్తి వైరాగ్యతత్సౌఖ్యం

నాస్తి ముక్తేః పరంపదమ్

(స్కాందపురాణము)

భావము : అరుణాచలుము కంటే మిన్నయగు క్షేత్రము లేదు. పంచాక్షర మంత్రము కంటే శ్రేష్ఠమగు మంత్రము లేదు.

మహేశ్వర ధర్మము కంటే మించిన ధర్మము లేదు. శంభున కంటే మించిన దైవము లేదు.

శివజ్ఞానము కంటే మించిన జ్ఞానము లేదు, శ్రీరుద్రము కంటే మించినది లేదు.

శివభక్తులలో విష్ణువుకు సాటిలేరు. భక్తితో శుభప్రదమైన విభూతిని ధరించుట కంటే మించిన రక్షణలేదు.

రుద్రాక్షను ధరించుట కంటే మించిన భద్రభూషణము లేదు. శంకరవేదము కంటే మించిన శాస్త్రము లేదు.

బిల్వపత్రముల కంటే మించిన పత్రములు లేవు. సువర్ణ పుష్పమును మించిన పుష్పము లేదు.

వైరాగ్యము కంటే మించిన సౌఖ్యము లేదు. ముక్తికి మించిన పరమపదము లేదు.

స్మరణ మాత్రముననె పరముక్తి ఫలద।
కరుణామృ తజలధి యరుణాచ లమిది॥





అరుణాచలేశ్వరస్వామి      అపీత కుచాంబమాత


ప్రచురణ

**శ్రీ దత్తసాయి సేవా సమాజ్**

హైదరాబాద్. ఫోన్ : 040-27662298